# “హెర్క్యులిస్ దృఢత్వానికి కారణం ఏమిటి?

# అందులోవున్న 778 భాగాలన్నింటి గురించి మేము ఎంతో శ్రద్ధ తీసుకోవడమే”

శ్రీ ఏ. సుబ్రహ్మణ్యం, సీనియర్ ఇంజనీర్
(ప్రోడక్ట్ డిజైన్ & టెస్టింగ్),
టిఐ సైకిల్స్ అఫ్ ఇండియా, మద్రాసు-600 053



సైకిళ్ళ గురించి పూర్తిగా తెలిసినవారిని అడగండి — ఏ. సుబ్రహ్మణ్యం వంటి వారిని. సైకిళ్ళ గురించి ఎప్పుడూ ఆలోచనలలో నిమగ్నమయివుండేవారిని. సైకిళ్ళే వారి ప్రపంచం.

హెర్క్యులిస్ గురించి ఉత్తమమయిన విషయాలెన్నో వారు మీకు చెప్తారు. భారతదేశంలో అది ఉత్తమమైన సైకిల్ కావడానికి కారణాలు చెప్తారు : తయారు చేసే విధానాలు, అందులో వున్న 778 భాగాలు, (ఔను, 778 భాగాలు వున్నాయి !) పరీక్షలు, నాణ్యత గురించి తీసుకునే శ్రద్ధ.

## హెర్క్యులిస్ : పరీక్షించడం లోనూ, నాణ్యతా విధానాలు అమలు పెట్టడంలోనూ పూర్తి శ్రద్ధ తీసుకుంటారు.

ప్రతి హెర్క్యులిస్‌కి ముడిపదార్థాలని పరీక్షించడంతో సహా 67 పరీక్షలు విడిగా చేస్తారు.

ప్రతి బ్యాచ్ నుంచి ఒక హెర్క్యులిస్‌ని తీసుకుని విత్రహింస' పరీక్ష చేస్తారు— అంటే ఒక వారం రోజులు విరామం లేకుండా తిరిగేటట్లు చూడడం !

రిమ్ములు, ట్యూబ్‌లు మరియు టైర్లు డన్‌లప్ నుంచే కొంటారు. (టిఐ సైకిల్స్ శ్రేష్ఠమయినవాటినుంచే కొంటుంది.)

## మీ హెర్క్యులిస్: సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా ప్రత్యేకమైన బాల్ బేరింగ్‌లు

రెండు పూర్తి వరసల హై-క్రోమ్ స్టీల్ బాల్స్ సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా వుంటుంది. మరియు ఎక్కువ బరువులు తీసుకువెళ్ళేటప్పుడు సులభమయిన ఫ్రీ-వీలింగ్‌కి తోడ్పడతాయి. హెర్క్యులిస్ బాడీ హై-బేకెడ్ ఎనామల్ మరియు హెవీ క్రోమియమ్ ప్లేటింగ్‌లతో తుది మెరుగులు యివ్వబడింది. ఫలితం : మీ హెర్క్యులిస్ సైకిల్ తన అందమయిన ఆకారాన్ని సంవత్సరాల తరబడి కాపాడుకుంటుంది.



TI హెర్క్యులిస్

TIC-2236 A

మీకు అత్యవసరంగా కావలసివస్తే ఈ రోజుల్లో ఎవరు యిస్తారు యిరవైవేలు?

# మీకు మీరే సహాయం చేసుకోవాలి ఐఓబిలో రిఇన్వెస్టుమెంటు డిపాజిట్ పథకం ప్రారంభించండి:










ఐఓబిలో యీ రి ఇన్వెస్టుమెంటు పథకం ఎప్పుడూ లాభదాయకంగానే వుంటుంది. ఎక్కువైన వడ్డీరేట్ల ధర్మమా అని ఈ రోజుల్లో ఇది మరీ లాభదాయకం. మీ మొదటి డిపాజిట్ నుంచి 16% తిరిగివస్తూనే వుంటుంది.

కాస్త జాగ్రత్తగా యీ ఆర్‌డిపి పరిశీలించండి.

తక్షణం అవసరంగాని మొత్తం చేతికివస్తే దానిని యీ ఆర్‌డిపిలో పెట్టండి. ప్రతి మూడు నెలలకీ వడ్డీ యిచ్చేబదులు అది మీ తొలి డిపాజిట్‌లో కలుస్తూ వుంటుంది. అంటే మీ వడ్డీ కూడా వడ్డీ సంపాదిస్తుంది. మీ డిపాజిట్టూ పెరుగుతూ వుంటుంది.

రూ. 10,000 డిపాజిట్ 84 నెలలలో రూ. 19965కి పెరుగుతుంది.

ఏ బహుమతిగానో, బోనసో జీవితభీమా సొమ్ము-మొత్తంగా చేతికి వస్తే ఐఓబిలో ఆర్‌డిపిలో వుంచండి. మీ డిపాజిట్ డబ్బు కాస్తా పెద్ద మొత్తమై కూర్చుంటుంది.

ఐఓబికి రండి.
మీ కోసం మా దగ్గిర చాలా పథకాలున్నాయి.

IOB 36/80 Tel.



**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**
ఏ ఔన్నత్యాన్నికోరే ఉత్తమ మిత్రుడు









ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు :

[1938--1972]

శుక్రవారం : 19-9-'80

రౌద్రినామ సం. భాద్రపద శు. దశమి

సంపుటము 74 సంచిక 1

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

దేశంలో ఏడాది చందా రు. 54-60

ఆరు మాసాల చందా రు. 27-30

విడి ప్రతి వెల ఒక రూపాయి

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# మ న లో మా ట

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక 73 సం॥లు పూర్తి చేసుకుని 74వ సం॥రంలో అడుగు పెట్టుతున్నది.

ఆబాల గోపాలం చేసుకునే పండుగ వినాయక చవితి— ఆంధ్ర సచిత్ర వారపత్రికకి పుట్టినరోజు పండుగ. ఈ సంచికలో 'కార్టూన్'లు ప్రత్యేకంగా ఉంటాయని వేరే చెప్పనక్కరలేదు. ఈసారి "బొజ్జ గణపయ్య"గారి మీద తరతరాలుగా వినిపించే రకరకాల చిత్ర విచిత్ర పురాణగాథలను, లోగడకన్నా యెక్కువ వేశాము ... పాఠకులు గమనించ గలరని ఆశ ! మన పండుగలన్నింటికి సింహద్వారం లాంటి పర్వదినం యీ 'చవితి' పండుగ— ఈ శుభ సమయంలో అందరికీ మా ప్రత్యేక శుభాభి నందనలు !

* * *

ఈ సంచికలో ఒక పెద్ద హాస్య కథ "మేడ వేసి చూడు" వేశాము— కొత్త సీరియల్ "ప్రేమతీర్థం" పాఠకులందరికి నచ్చుతుందని ఆశిస్తున్నాము.

* * *

తరుచుగా కథలు రాసే వారికి "దీపావళి కథల పోటీ" వివరాలు బాగా తెలిసే ఉంటాయి. అయినా, మీరు కథలు పంపే ముందు నిబంధనలను ఒక్కసారి చదివి మరీ పోటీలో పాల్గొనండి అని కోరుతున్నాం. లోగడ మీరు పంపిన కథలు — యిప్పుడు పోటీలలోకి "బదలాయించడం" సాధ్యం కాదని కూడా ప్రత్యేకంగా, మనవి చేస్తున్నాము— దీపావళి కథల పోటీ ప్రకటన పడ్డ తర్వాత అందిన "పోటీ కథ"లనే పోటీకి పరిగణలోకి తీసుకుంటామని వేరే చెప్పనక్కరలేదు కదా ?

* * *

ఇది ప్రత్యేక సంచిక కనుక షరా మామూలే. కొన్ని మామూలు శీర్షికలు పాఠకులు యిందులో చూడరు !

### ము ఖ చి త్రం

అపరిచిత తారలను ముఖచిత్రాలుగా ప్రచురించడంలో పత్రికకొక స్థానముంది. ఉదాహరణకు 29.8.80 సంచిక ముఖచిత్రం అంబికను నేను ఇదివరకు ఏ సినిమాలో చూడలేదు. ఆమె పేరుకూడా వినలేదు.

పంతంగి రవీంద్రశ్రీనివాస్ [ఖమ్మం]

### శీ ర్షి క లు

ఈ వారం 5.9.80 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "అక్కయ్య సలహా", "ఏం చదువులో" అనే కథలు నాకు నచ్చినవి. ధర్మపథం, సామాన్యుని సణుగుడు, ఫాలాక్షునిడైరీ, హైద్రాబాద్ నోట్ బుక్‌ల వంటి శీర్షికలు పత్రికకే ఆణిముత్యముల వంటివి.

వందిగాము మణిమోహన్‌కృష్ణ (హైదరాబాద్)

### కా ర్టూ న్స్

29.8.80 వారపత్రిక కథలు అన్నీ బాగున్నాయి. ముఖ్యంగా "ఇదేం బుద్ధి" కథ వాస్తవానికి దగ్గరగా ఉంది.

7వ పేజీలోని కార్టూన్ కడుపుబ్బ నవ్వించింది. 37వ పేజిలో గీతాగారి కార్టూన్లు, కార్టూన్లలాగా అనిపించలేదు. వాస్తవాన్ని చాటి చెప్పే చిత్రాల్లాగా అనిపించాయి.

పాండ్రాల ఉమాశంకర్ [వడ్డెపల్లి]

### క వి త

ఈ వారం మా అభిమాన వారపత్రికపై ముఖ చిత్రంగా, జుగుప్సాకరంగా ఉన్న 'సింపుల్




కపాడియా' అసలు ఏ మాత్రం బాగా లేదని తెలియజేయడానికి విచారిస్తున్నాము. 'భయం', "ఏం చదువులో" కథలు బహు చక్కగాఉన్నాయి. మిగతా రెండు కథలూ ఫర్వాలేదనిపించాయి. సామాన్యుని సణుగుడులో "నిత్య స్వగతాలు" రచనలో వీరాజీగారు నవ్వించేశారు. సూర్యదేవర గారి "వికసిత కుసుమం" కనువిప్పు పొందిన విద్యార్థిని చక్కగా చిత్రించారు. కవిత చక్కగా వుంది. సినీ పేజీలలో విశేషాలు చాలా చక్కగా ఉన్నాయి. ధర్మపథంలో ప్రహ్లాదుని ప్రబోధం బులుసువారు బాగా వ్రాశారు.

పెన్మెత్స సూరిబాబు, కృష్ణ, శ్రీను, శ్రీదేవి, దుర్గ, బుజ్జి, బాబు, అరుణ, భారతి, శారద, భాస్కరరాజా [ హైదరాబాద్ ]

### సీ రి య ల్స్

ఆధునిక ఫాషన్స్‌తో అందాన్ని మురిపించే నటి అంబిక ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రిక మమ్మల్నెంతో ఆకర్షించింది. రత్నాల్లాంటి రెండు సీరియల్స్ ఆసక్తి దాయకంగా ముందుకు సాగుచున్నవి.

బి. మహమ్మద్‌షరీఫ్ (గుత్తి)

### క థ లు

29.8.80 సంచిక ముఖ చిత్రం నటి అంబిక చాలా చక్కగా సర్వాంగసుందరంగాఉంది.

"ఇదేం బుద్ధి" కథానిక వాస్తవానికి చాలా దగ్గరగా , సందేశాత్మకంగా ఉంది. తన భార్యపై అధికారులకు ఎరగా చూపించి స్వప్రయోజనాలు చూచుకొనే స్వార్థపరుడైన శ్రీహరి లాంటి వారికి ఇది గుణపాఠము నేర్పుననుటలో అతిశయోక్తి లేదు. "ప్రేమ లేఖ" కథానికయందు 50 సం. రాల శివానందం గారు "ప్రేమలేఖ" కోసం పడే అవస్థ చూసి నవ్వకుండా ఉండలేక పోయాము. చివరకు ఒక ప్రేమ లేఖను సంపాదించి , తర్వాత అది తనది కాదని తెలిసిన అతని మనో భావాలను చూసి జాలిగా ఓ నవ్వు విసిరాము.

"సినిమా" శీర్షిక యందు ప్రచురించిన రంగుల బొమ్మలు చాలా చక్కగా ఉన్నాయి.

లోకం నర్సయ్య, సరస్వతి, లక్ష్మీపతి, ఇందిరా [నవి పేట]

### వ ం ట లు

నా వంట 'కొబ్బరితో కొన్ని రుచులు' 5—9—80 సంచికలో ప్రచురణ చేయబడినది. దాని అందు పేరు బి. శ్యామసుందరికి బదులు పి. వరలక్ష్మి అని బడినది. సవరణ చేయగలరు.

బి. శ్యామసుందరి (తెనాలి)

ఔషధులు ఉన్న విషయం తెలియదు. శరీరంలో శక్తి ఉడిగిపోయినప్పుడు, శారీరక మానసిక ఆరోగ్యాన్ని నిలబెట్టడానికి, వయసు ముదిరిన కొద్దీ శరీరంలో శక్తి తగ్గిపోతున్నప్పుడు ఇలాంటి వాటికి పురాతన ఆయుర్వేద పండితులు అమూల్యమైన మూలికలు, ఇతర వస్తువులతో ఎటువంటి వ్యాధులనైనా కుదర్చగల ఔషధాలు సూచించారు.

నేటి అవసరాలను, పరిణితి చెందుతున్న పరిస్థితులకు సంబంధించిన పురాతన బోధనలను క్షుణ్ణంగా చదివి వర్గీకరించిన తరువాత అద్భుతమైన ఈ "గ్యాస్ట్రో" ఔషధం తయారు చేయబడింది. మేము ప్రత్యేకంగా తయారు చేసిన "గ్యాస్ట్రో"ను మీరు వాడడం ప్రారంభిస్తే పైన తెలిపినటువంటి శారీరక పరిస్థితుల్లో స్థిరమైన మార్పులను మీరు గమనిస్తారు. దానికి కారణం మేము తయారు చేసిన శక్తివంతమైన ఔషధమేనని నిర్వివాదంగా చెప్పగలం. 'పని పని లేని నమ్మకం, నమ్మకం లేని పని ఈ రెండూ అర్థం పర్థం లేనివని అభిప్రాయపడవలసి వుంటుంది. దీనిలో చర్చించిన అంశాలను పరిపూర్ణంగా గ్రహించాలనే తలంపుతో మీరు దీనిని పదేపదే చదివినపుడు మీలో ఉండే అనారోగ్యత తొలగి పోవాలని ఆత్రుత పడుతూ ఉంటారు. మనమందరం జీవితాంతం మానసికంగా, శారీరకంగా, సుఖ శాంతులతో ఆనందంతో వుండాలని కోరుకుంటాం. ఉదర కోశంలో గ్యాస్ చేరి, బాధ పడుచున్న రోగులు తమ అనారోగ్యానికి కారణాలు గ్రహించినప్పుడు వారు తమ స్వంత తోటలో బంగారు గని కనుగొన్నట్లేనని వారు భావించాలి.

"గ్యాస్ట్రో" ఒక ప్రసిద్ధమైన ఆయుర్వేద ఔషధం. ఇది 240 గ్రా. సీసాలో పొడరు రూపంలో నింపబడింది. డ్రగ్ లైసెన్సు నెం. 47/25-డి/78. రిటైల్ ధర రూ. ***21–25*** [పన్నులు అదనం] కన్న మించరాదు.

తయారు చేయువారు :

# రాణి డ్రగ్ హౌస్,

నెల్లాయి—P.O. P.N. 680305,

తిరుచూరుజిల్లా, కేరళ స్టేట్.

## ఆంధ్రప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు :

1. హైదరాబాద్ మరియు తెలంగాణా జిల్లాలు :

**మెస్సర్స్ జైన్ ఫార్మసీ**

ఫార్మాస్యూటికల్ డిస్ట్రిబ్యూటర్లు,
సిద్దియంబజార్, హైదరాబాద్—500012, ఫోన్: 41457.

2. కృష్ణా, పశ్చిమ గోదావరి అండ్ ఖమ్మం జిల్లాలు :

**మెస్సర్స్ మిశ్రిలాల్ మిలాన్‌చంద్ అండ్ కం.,**

ఫార్మాస్యూటికల్ డిస్ట్రిబ్యూటర్స్,
కందులవారివీధి, విజయవాడ—520001. ఫోన్ : 77804 & 76339.

3. తూర్పు గోదావరి మరియు వైజాగ్ జిల్లాలు :

**మెస్సర్స్ గోకులం**

ఫార్మాస్యూటికల్ డిస్ట్రిబ్యూటర్స్, శ్రీరామ్‌నగర్, కాకినాడ, ఫోన్ : 3303,
D. No. 13/16, ప్రకాశ్ నగర్, రాజమండ్రి, ఫోన్ : 5538.
సాయి లాడ్జి, వాల్తేరు, అర్. ఎస్. రోడ్డు, విశాఖపట్నం, ఫోన్ : 3783.

4. కర్నూలు జిల్లా :

**మెస్సర్స్ పరాస్ మెడికల్ ఏజెన్సీస్**

1—9, చౌక్‌బజార్, కర్నూలు—518 001.

5. నెల్లూరు జిల్లా :

**మెస్సర్స్ రాయల్ డ్రగ్ స్టోర్స్**

అప్‌స్టెయిర్స్ రూం నెం. 3, ట్రంకురోడ్డు, నెల్లూరు.

6. గుంటూరు జిల్లా :

**మెస్సర్స్ శ్రీలక్ష్మి మెడికల్ స్టోర్స్**

ఫార్మాస్యూటికల్ డిస్ట్రిబ్యూటర్లు, డి. ఎస్. బిల్డింగ్స్,
నాజ్ సెంటర్, కొత్తపేట, గుంటూరు పిన్ : 522 001, ఫోన్ : 21622.

7. ఒంగోలు జిల్లా :

**మెస్సర్స్ ప్రకాశ్ మెడికల్ ఏజెన్సీస్**

ఫార్మాస్యూటికల్ డిస్ట్రిబ్యూటర్స్
అమరజీవి మునిసిపల్ బిల్డింగ్స్, ట్రంకురోడ్డు, ఒంగోలు—523 002.

"గ్యాస్ట్రో" ఆంధ్రలో అన్ని ప్రముఖ మందుల షాపులలో దొరకును.

మీ వ్యాధి గురించిన పూర్తి వివరాలకు మాకు వ్రాసి 50 పైసలు విలువగల స్టాంపులు అతికించి అత్యుత్తమమైన వైద్య సలహాను పొందండి. మీరు "గ్యాస్‌ట్రబుల్"పై కరపత్రాన్ని 50 పైసల స్టాంప్ పోస్టేజికొరకు పంపితే ఉచితంగా పంపగలం. "గ్యాస్ట్రో" సీసా V. P. P. ద్వారా విడిపించుకొదలచుకుంటే రు. 10 లు అడ్వాన్స్‌గా పంపవలెను. ఒక సీసాకు రూ. **30/–** లు, పూర్తి మొత్తాన్ని చెల్లించినమీదట అది మీకు రిజిస్టర్డు పోస్టులో పంపబడును. అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు ఇంగ్లీషు, తమిళము, లేదా మళయాళంలో మెస్సర్స్ ఎస్. జె. కంపెనీ, (దిగువ చిరునామా)తో జరపవలెను.

కేరళ, కర్ణాటక, గోవా, తమిళనాడు, ఆంధ్రాలలో దిగువవారిచే మార్కెట్ చేయబడింది

# మెస్సర్స్ ఎస్. జె. కంపెనీ,

వెస్ట్‌ఫోర్ట్ కల్యారి రోడ్, పూతోల్ పి. ఒ. తిరుచూర్ - 680 004.

ఫోన్ : 20604. ★ గ్రామ్స్ : ESJAY C.O,

ప్రముఖ కెమిస్టులు అందరివద్ద గ్యాస్ట్రో లభించును.

భారతదేశములో, ముఖ్యముగా ఆంధ్ర దేశములో శివ కేశవుల తరువాత యెక్కువగా కొలువబడే దైవం వినాయకుడే. వినాయకుడిని విఘ్ననాయకునిగా తలుస్తారు మనవారు. వైదిక పరమైన యే శుభకార్యమైనా సరే యే విఘ్నము కలగకుండా రాకుండా నిరాటంకముగా జరిగిపోవాలంటే ముందుగా విఘ్నేశ్వరుడి పూజ సలపటం మనకు అనూచానయంగా, అనాదిగా వస్తున్న ఆచారము. 'ఆదౌ శ్రీ మహా గణపతి పూజాంచ కరిష్యే.' అన్నది వేదమంత్రము. ఈ వినాయకుని పూజ ప్రతి భాద్ర శుద్ధ చతుర్థినాడు వస్తుంది. ఈ విధమైన నిర్ణయం వల్లనే ఆ భాద్రపద శుద్ధ చతుర్థి నాడు ప్రజలు మూర్తిని ప్రతిష్ఠించి అత్యంత వైభవంగా సంబరంగా పూజలు చేసుకుంటారు.

ఇంత ప్రాముఖ్యం వహించి పూజలందుకుంటున్న యీ వినాయకుడు స్థూలకాయుడు. ఏనుగు తల, విరిగిన దంతం, పెద్ద బొజ్జ, మరుగుజ్జు. ఎలుక వాహనం! ఈ వినాయకుడి జననం గురించిన ఎన్నో గాథలున్నాయి. అసలు వినాయకుడికి పూజలు సలిపే ఆచారం మనకు బౌద్ధమత ప్రచారమువల్ల వచ్చిందని కొందరు విమర్శకులన్నారు. ఈ పాశ్చాత్య విమర్శకుల విమర్శ సత్యదూరము. వారలు యిందుకు నిరూపణగా వివిధ దేశాలలో దొరుకుతున్న విఘ్ననాయకుడి విగ్రహాలను చూపిస్తున్నారు. ఈ చర్చని విమర్శకారులకే వదలివేసి వినాయకుడి జన్మాన్ని గురించీ, వినాయకుడిని గురించిన ఆఖ్యానాల పరిశీలించితే ప్రశస్తంగా కనిపించేవి రెండు గాథలు.

## కథలు—గాథలు

ఆయన జన్మాన్ని గురించిన గాథలు ఎన్నో ఉన్నాయి. దేవతలకు కష్టాలు రావటం సాధారణమే. ఆ కష్టాలను పోగొట్టి ఏదో తరుణోపాయం చూపించటానికి త్రిమూర్తులలో ఎవరో ఒకరు రానటము సాధారణమే. వినాయకుడి విషయంలోనూ అదే గాథయే. నిరూపాకుడు విబుధుల కష్టాలు పారద్రోలటానికి వినాయకుని సృష్టించేడని ఒక గాథ. ఇంకొకటి బాగా వాడుకలో నున్నది పార్వతి సృష్టి యని. పార్వతి ఒక పర్యాయం స్నానమాడబోయి, స్నానాల గదికి కాపలాగా తన మేని మీదనున్న

# "ఓబొజ్జ వెనకయ్యా నీవెంత నేనయ్యా?"



చిత్రం : జి. భాస్కరరావు

మట్టిని తీసి బొమ్మచేసి (ఇది మహారాష్ట్ర లలో ప్రసిద్ధంగా చెప్పబడుతోంది. పసుపుతో చేసిందని ఆంధ్రదేశాన ప్రతీతి)ద్వారం దగ్గర ఉంచి ప్రాణంపోసింది. ఎవరిని లోనికి రానీయ కని పార్వతి చేసిన కట్టడి. జీవం పొందిన ఆ పసుపుముద్ద శివుడని యెరుగక అడ్డగించి ఘోర యుద్ధము చేసి, చివరకి శివుని చేత చంపబడుతాడు. పార్వతి బాధను చూడలేక ఎక్కడో ఓ యేనుగుని చంపి తలని అతికిం చేరు! ఉమాశంకరులు గజరూపములో ఒకరి నొకరు కలియటంచేత పుట్టిన రూపము గజాననుడు అని యింకో కథ! తిరిగి యా ఏనుగు మోము ఏలికకు ఒక ఉదంతం! గజాసురుడనే రాక్షసుడిని సంహారం చేయ టానికి దంతాన్ని పెరికేడని ఒక వాదం. పరమేశ్వరుడిని దర్శించటానికని వచ్చిన పరశురామునితో యుద్ధం చేసినపుడు కొమ్ము విరిగిందని ఇవి గణపతి జననానికి సంబంధించిన కథలు. గణపతికి సంబంధిం చిన కథలున్నాయి.

## భార్యలుగా అష్టవసువులు

గణపతికి రుద్రుడు గణాధిపత్య మిచ్చాడు. ఆ శుభ సమయాన్ని పురస్కరించుకుని సలుప అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశ, వశ అన్న ఎనమం డుగురుని ఆయనకు భార్యలుగా ప్రసాదిం చాడు. బ్రహ్మ అనుగ్రహించిన కానుకలకు యెంతైనా మురిసిపోయి ప్రతిగా వినాయకుడు బ్రహ్మను వరం కోరుకొమ్మన్నాడు. బ్రహ్మ సృష్టికర్త. అంచేతే, తన సృష్టికార్యము నిర్విఘ్నంగా కొనసాగేలా చేయుమని విఘ్నేశ్వరుడిని కోరుకున్నాడు. అల్లాగే కరుణించాడు గణపతి. ఒకసారి గణపతి యేడు లోకాలు తిరుగ బయలుదేరాడు ఎలుక నెక్కి. చందమామ కెందుకో ఆ రూపాన్ని చూడగానే పక్కున నవ్వు వచ్చింది. గణపతి కోపంతో, శాపం యిచ్చాడు. చంద మామ నెవరు చూచినా అపనిందల పాలవ గలరని. శాపంతో భయపడి జాబిల్లి సముద్ర గర్భాన దాగి కొన్నాడు. లోకాలు చీకటి మయమయి పోయాయి. దేవతలు కోరిన మీదట అనుగ్రహించి, ఒక్క చవితినాడు చూస్తే అలా అపనిందల పాలవుతారని సరిదిద్ది, అనాడైనా చూచినవారు శమంతకో పాఖ్యానం చదివితే తొలగిపోతాయని సవరణ చేసేరు.

ఈ శమంతకోపాఖ్యానం హరివంశం, విష్ణుపురాణం, భాగవతం, స్కంద పురాణా లలో ఉంది. ఇది అందరకు తెలిసిన కథే!

## నీలాప నిందలు

నిఘ్నుడు ద్వారకకు రాజు. నిఘ్నుని కొడుకులు ప్రసేనజిత్తు, సత్రాజిత్తు. సత్రాజిత్తు సూర్యారాధకుడు. సూర్యుడు సత్రాజిత్తుకు శమంతక మణిని యిచ్చాడు. ఆ మణి దినదినము ఏడు బారువుల బంగా రాన్ని యిస్తుంది. ఇటువంటి మణి రాజుల దగ్గర ఉండవలసిందని కృష్ణుడు అన్నాడు. ఉగ్రసేనుడికి యిమ్మని అన్నాడు. సత్రా జిత్తు యివ్వలేదు. అన్నకు యిచ్చాడు. అన్న ప్రసేనుడు మణిని మెడలో ధరించి వేటకు వెళ్ళాడు. వేటలో సింహంచేత దెబ్బతిని ప్రాణం గోలుపోతే, సింహాన్ని చంపి జాంబ వంతుడు మణిని తన కుమార్తెకి ఆడు కోటానికి యిచ్చాడు. కృష్ణుడే యివ్వలేదన్న కోపంతో ప్రసేనుడిని చంపేడన్న ప్రథని

తొలగించటానికి కృష్ణుడు స్వయంగా అడవికి వెళ్లి జాంబవంతుడిని ఓడించి మణిని తెచ్చి, నిజాన్ని నిరూపించి నిందలకు దూరుడయేడు. ఇది శమంతకోపాఖ్యానం. శ్రీకృష్ణుడికి శమంతకం దొరకలేదు కానీ, జాంబవంతుడు కూతురు జాంబవతి దొరికింది.

ఏది యేమయినా భాద్రపద శుద్ధ చవితినాడు వినాయకుని జన్మదినంగా యుగ యుగాల నుండి వస్తున్న నమ్మిక. ఆ నాడు భక్తులు మంగళ స్నానము చేసి మట్టితో మూర్తిని చేసి, అలంకరించిన పీఠం మీద బియ్యంగానీ, వడ్లుగానీ పోసి మూర్తికి ఆవాహన చేస్తారు. ఇరవయ్యొక్క ఆకులతో పూజ చేస్తారు. ఈ దేవుడికి ఉండ్రాళ్ళ అత్యంత ప్రీతియైన వంటకము.

## తెలంగాణా రాయలసీమల్లో

తెలంగాణ ప్రాంతంలో వినాయక పూజ జరిగిన సాయంకాలం కుర్రకారు అక్షతలు చేత బట్టుకుని యింటింటికి పోయి పాటలు పాడుతూ నమస్కారం చేస్తారు.

వెనకయ్య వెనకయ్య వేముల తాత
కంకా పళ్ళూ కామారూపూ
ఎత్తయిన గొడుగులు ఆకాశం కూలు
దూది మడుగు ల్దప్పటి రేకుల్
వాగూ నీళ్ళూ వనం పత్రి
తెల్లటి గూట్లో నల్లటి వెనకయ్యకు
నాలుగు చేతుల నమస్కారాలు!
అంటూ పాడి—
ఓ బొజ్జ వెనకయ్య, నీ వెంట నేనయ్య
ఉండ్రాళ్ళ మీద, నీ దండు పంపయ్య!

అంటూ కేరింతలు కొడతారు. పూజా విధానంలో మార్పులు లేవు కానీ, పైపై మాటల్లో ఆటల్లో పాటల్లోనే మారుపులు. రాయలసీమలో కూడ యిటువంటి విధానం ఉన్నది కానీ, పిల్లలు పాడేపాట వేరు.

'మంగళ మూర్తి మారయ్యా!
బారో వర్షకి బారయ్యా!
హోళిగ తుప్పా హాకయ్యా!
వింగే నంగే బేకయ్యా!'

అంటూ పాడతారు. ఇది బహుశః కర్ణాటక ఆచార ప్రభావంతో వచ్చిన దయ్యుటుంది.

ఈ పూజలయాక మూడు రోజులకు కొందరూ, తొమ్మిది రోజులకు మరి కొందరు నీటిలో ముంచి వేస్తారు. అక్కడక్కడ కొంతమంది మనసులో కొన్ని కోర్కెలుంచుకుని అవి తీరే వరకు గూళ్ళలో పూడ్చి వేయటం పరిపాటి. చదువుల దేవతగా గూడ వినాయకుడిని పూజించుతుండటం విశేషం! కొన్ని కొన్ని చోట్ల, 'ఓం నమః శివాయ' అన్న అక్షరాభ్యాసపు మన మంత్రము లాగే 'ఓం గణేశాయనమః!' అన్నది వినిపిస్తున్నది బదులుగా. సామవేదోపాసకులు యీనాడు ఉపాకర్మ చేసుకుంటారు.

## మహారాష్ట్రలో

మహారాష్ట్రలో యీ గణేశ చతుర్థిని అత్యంత ఉత్సాహంగా జరుపుకుంటారు. ఈ పండుగతో జాతీయ సమైక్యతను జత చేరిచి జాతిని సంఘటితం చేసే ప్రయత్నంలో అత్యంత సఫలతని గాంచేరు. తిలక్ మహాశయులు బొంబాయి వంటి పట్టణాలలో ఈ వినాయకుడి మూర్తుల కోసం వేనకు వేలు ఖర్చు చేయటం చూడనగును.

చంద్రుడిని చూడటం వలన గలిగే దోషాన్ని పరిహరించుకోటాన్కి యీశ్లోకాన్ని చదువుతారు.

సింహప్రసేన మవధీత్, సింహో జాంబవతా హతః
సుకుమారక మారోద తవ హ్యేష శమంతకః

అని. విఘ్నాలని పోగొట్టి ఇష్టకామ్యార్థ సిద్ధులను పాఠకులకు ఆ గణేశుడు ప్రసాదించును గాక!

—జోస్యము విద్యాసాగర్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక చందా వివరాలు

| | ఏజంటు ద్వారా రు. పై. | పోస్టు ద్వారా రు. పై. |
|---|---|---|
| మూడు నెలలకు | 13–00 | 13–65 |
| ఆరు నెలలకు | 26–00 | 27–30 |
| సంవత్సరానికి | 52–00 | 54–60 |

బిజినెస్ మేనేజర్,
"ఆంధ్ర సచిత్ర వారపత్రిక"

# నిండుదంపతులోయ్!

శ్రీమతి అజిత్



"బావా.... ఆపేస్తా.... ఇంక.
చాలు బావా!"

"ఇంకొక్క నిమిషం."

"ప్లీజ్! బావా! ...వుహూ... ఊఁ..."

ఫిఫ్టీ సెకండ్స్ మోర్..."

"అత్తకిప్పుడే వుత్తరం ... వ్రాస్తా నీ గురించి."

"థర్టీ సెకండ్స్."

"షటప్"

"ఫిఫ్టీన్"

"వూఁ వూఁ వూ"

"ఇక అపుతర్లే. ఈ లాస్ట్ మినిట్‌కు ఎంత గోల పెట్టావు. జస్ట్ ఫర్ వన్ మినిట్."

"ఏం వన్‌మినిట్ బాబూ! ... ప్రాణాలు తోడుకుపోతున్నాయి."

* * *

ఎప్పుడూ ఇంతే. తెల్లవారే మూడ్ చెడ గొడ్తాడు. మీరే చెప్పండి—పరీక్షల రోజుల్లో కూడా వుదయం ఆరుగంటల దాకా మంచం దిగని నన్ను చలికాలం, ఎండాకాలం అనే భేదమే లేకుండా నాలుగున్నరకి లేపడం న్యాయమా? 'లేజీబోయ్' అని నా స్నేహితులు నామీద ఎప్పుడో వర్‌డిక్ట్ పాస్ చేసారు. అటువంటినన్ను 'ది గ్రేట్ బద్ధకపు మహేశ్వరి'ని వ్యాయామం చెయ్యమంటాడా? ఈ పుస్తకం పుణ్యమా అని ప్రతి దాన్లోను హెల్త్ కేరంటూ నాలుగయిదు రకాల ఎక్సర్‌సైజెస్ వుంటాయి. ఓ మాగజైన్లో వున్నది ఇంకోదాన్లో వుండదు. సో, నేనెంత అరచి గీపెట్టినా మినిమమ్ టెన్ అయిటమ్స్‌తో తయారయి నన్ను అవన్నీ చెయ్యమంటాడు.

'కొంచెం నడుం తగ్గితే నువ్వు చాలా... చాలా బావుంటావ్ తెల్సా.'

'ఇప్పుడు బాగా లేకపోతే నన్నెందుకు పెళ్లి చేసుకున్నావ్ ?'

'ఆ... ఆ. మాట్లాడు చాలు. నో ఆక్షన్ ప్లీజ్' అన్నా, నన్ను చుట్టబోతున్న చేతులను ఆపుతూ.

బడమని ప్రాణం తీస్తున్నా చాలా ప్రేమగా చూసుకొంటాడు బావ నన్ను. ఇంట్లో పనులన్నీ ఫిఫ్టీ అని తను కూడా చేస్తాడు. వంటల్లో నేను పప్పు వేస్తే తను కారం, నే జీడిపప్పు వేస్తే తను ద్రాక్ష అలా షేర్ చేస్తాడు. బీచ్‌కెళ్తే కోన్ ఐస్‌క్రీం' థియేటర్లో క్లో హాంబర్గర్స్, లిమ్కా, హోటల్స్‌లో అక్కడి స్పెషల్స్ ఇలా నన్ను చాలా పాంపర్ చేస్తాడు. పోనీలే, బావ ఆశపడుతున్నాడు కదా, సన్నబడదామని నేను నా కాలరీస్ కట్‌చేస్తే మాత్రం చాలా కోప్పడుతాడు. 'నాజూగ్గా వుండమంటే స్టార్వ్ అవడం కాదు. తిండిమాని కాదు తగ్గడం, కొంచెం స్వెట్ అయి' అంటాడు.

* * *

మొదట్లో పోనీలే అని తిట్టుకుంటూ, ఏడ్చుకుంటూ చేసేదాన్ని. కాని ఇప్పటికి ఆరేడు నెలలయినా నన్ను వీటినుంచి మాన్పించేట్టు లేదు. నేనిటు తగ్గనూ లేదు. అటు హాయిగా నిద్రా పోలేదు. ఇక ఏదో వొకటి ఆలోచించకపోతే రెంటికీ చెడ్డ దాన్నవుతానని సీరియస్‌గా అనుకొన్నాను, చేతిలో వున్న పత్రికను తిరగేస్తూ, పేజి నిండుగా వున్న 'ఎయిర్ ఇండియా' అడ్వర్టైజ్‌మెంట్ నన్నాకర్షించింది. మహారాజా ప్రక్కన ఓ "షెవర్లీ డేవ్" వుంది. 'ఛీ. మహారాజాతో ఈ మునగకాయ ఏమిటి ? చక్కటి పొట్టిబుడుంకాయ వుండాలి గాని' అని అనుకొన్నా. నాకు సొల్యూషన్ దొరి కిందన్పించింది.

* * *

అర్థం కాలేదా? ఇప్పుడు నేను, బావ షికారెళ్దామని బయల్దేరితే మా ఎదురింటి




## ఫాలాక్షుని డైరీ

మిటాయి పెట్టి, మీ నాన్న పిలుస్తున్నాడనో, లేక మీ అమ్మరమ్మంటుందనో చెప్పి, ఏమార్చి ఎత్తుకపోతున్నారట. చిన్న పిల్లలు దొరికితే కాలో, చెయ్యో, కన్నో పీకిపారేసి, ముష్టిలో దించేస్తున్నారట. పదిపన్నెండేళ్ల ఆడపిల్లలు దొరికితే వో ఏడో, రెండేళ్లో పోతే వ్యభిచారానికి పనికొస్తారని మంచి ధరలకు అమ్మేస్తున్నారట. ఈ వ్యాపారంలో అమోఘంగా పని చేస్తున్న వో భార్య భర్తలను ధర్మపురిలో ఆవుధ్య పోలీసు అరెస్టు చేసిందట. మొన్న 20వ తేదీన గవుళపట్టి గ్రామానికి చెందిన ఎనిమిదేళ్ల చిత్ర, 10 ఏళ్ల మునియమ్మ, 17 ఏళ్ల మురుగేశన్, 5ఏళ్ల కరుణానిధి అనే నలుగురు పిల్లలను వో ముగ్గురు ఆడవాళ్లు మిటాయి ఆశ పెట్టి ఎత్తుకపోతుండగా చూసిన పౌరులు వారిని చితకబాది, పోలీసులకు నప్పగించి, పిల్లలను వారి తల్లిదండ్రులకు చేర్చారట.

### ప్రళయానికి దారితీసిన ప్రేమ!

పూత్తంకరైకు చెందిన మురుగన్ అనే కుర్రాడు, అదే వూరుకు చెందిన సరోజ అనే అమ్మాయి పరస్పరం ప్రేమించుకున్నారట. ఏది ప్రేమను సరోజ తల్లిదండ్రులు ఆనందించక, నిరాకరించి, అప్పటికే అవి ఆగనందువల్ల యిహ లాభం లేదని నిశ్చయించుకుని మురుగన్ని చావబాదేశారట. ఆ బాదుడుపాలెక్కువయినందువల్ల మురుగన్ చని పోయాడట. ఈ సందర్భంగా పోలీసు కొందర్ని అనుమానించి అరెస్టు చేసిందట. సరోజ తండ్రి మయిలాబాపే యీ హత్య చేశాడన్న నమ్మకంతో మురుగన్ అన్న అతన్ని తన్నబోయాడట. మయిలా తన బావకందసామిని యింట్లో పెట్టి తాళంవేస్తే మురుగన్ అన్నకందసామి అర్ధరాత్రియింటిపెంకులు తీసి ఆ యింట్లో ప్రవేసించి, కందసామిని యింటి బయటకులాగి, తాను, తన అనుయాయులూ చేరి చిత్రవధ చేసి చంపేశారట.

### తీపితింటే కొడుకు!

గర్భిణీ స్త్రీలు తీపి వస్తువులు, పంచదార, సగ్గుదాలు ఎక్కువగా ఉపయోగిస్తే మగ శిశువు పుడ్తాడని మాంసం, గుడ్లు, మసాలాదినుసుల వస్తువులు ఎక్కువగా ఉపయోగిస్తే ఆడపిల్ల పుట్టుందని పారిస్‌కు చెందిన వో విశ్వవిద్యాలయ వైద్య విజ్ఞాన నిపుణులు అభిప్రాయపడుతున్నారట. ఈ విషయం వారు చాలామంది గర్భిణీస్త్రీల అలవాట్లు, తిండి వివరాలు, ఆనక వారికి పుట్టిన పిల్లలూ అన్నీ పరిశీలించికూడా అభిప్రాయపడ్డట్టు ప్రకటించారట.

### ఆస్తికోసం మామను హత్యచేసిన అల్లుడు!

అరూరుకు చెందిన చెల్లియంపట్టిపుదూరులో 29 ఏళ్ల చెన్నప్ప తన భార్యకు రావలసిన ఆస్తితో వాటా వెంటనే యిప్పియ్యమని తన మామగారు వెంకట్రామనును అడిగాడట. దానికాయన ఫకాల్ని నవ్వి తన మొదటి భార్య పిల్లలకు ఆస్తిలో చిల్లిగవ్వ చేరదని చెప్పేసరికి ఆవేశంతో పక్కనున్న పార తీసుకుని, ఆ పారతో శక్తికొద్దీ ఒక్కదెబ్బ కొట్టాడట. ఆ దెబ్బకు వెంకట్రామను తల పుటుక్కున తెగి టపీమని నేలమీద పడిందట.

# హైదరాబాదు నోట్‌బుక్

**రాజాజీ అంతర్జాతీయ సంస్థ :**

రాజాజీ శత జయంతి సంఘం హైదరాబాద్‌లో ఆయనపేర రాజాజీ ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎఫైర్స్, రాజాజీ అంతర్జాతీయ పౌర వ్యవహార సంస్థ అనే సంస్థను స్థాపించదలచింది. దానికోసం బోలారంలో 28 ఎకరాల స్థలంలో ఉన్న ఆనఫియా కోఠీని సేకరించడం కోసం ఆలోచనలు జరుగుతున్నవి. రాజాజీ శత జయంతి సంఘ సభ్యుడు మాజీ కేంద్ర మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం, సంఘం కార్యదర్శి శ్రీ ఎస్. రామకృష్ణన్ ఆగస్టు 15న ముఖ్య మంత్రి డాక్టరు ఎం. చెన్నారెడ్డితో ఈ విషయమై చర్చలు జరిపారు. ఈ చర్చలలో రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. ఆర్. రామమూర్తి, హైదరాబాద్ జిల్లా కలెక్టర్ శ్రీ ఎ. కె. గోయల్ ఈ చర్చలలో పాల్గొన్నారు.



బహుభాషాప్రవీణ ముదునూరి జగన్నాధరాజు

**సంజయ్ ఆటోమొబైల్ అకాడెమీ:**

ముఖ్యమంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ఆగస్టు 15న వనస్థలిపురంలో సంజయ్ ఆటోమొబైల్ అకాడెమీకి ప్రారంభోత్సవం జరిపారు. ఇది వంద ఎకరాల స్థలంలో స్థాపితమయింది. దీనిలో మోటార్ మెకానిజం, డీజిల్ మెకానిజం, ఆటో ఎలెక్ట్రీషియన్ మున్నగు వృత్తులలో ప్రత్యేక శిక్షణ ఇస్తారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ, జపాన్‌లోని నిస్సాన్ కంపెనీ సహకారంతో మూడు టన్నుల వరకు బరువు మోయగల లారీలను ఈ సంస్థ నిర్మిస్తుందని, దానికి 30కోట్ల రూపాయలు అవసరమని అన్నారు. ఈ అకాడెమీ అనుబంధ అకాడెమీలు రాయలసీమలోను, ఆంధ్రలోనూ కూడా ప్రారంభిస్తామని ముఖ్య మంత్రి తెలిపారు.

(65వ పేజీ చూడండి)




**శకుంతలకి నిర్వాకం చెయ్యాలన్న కోర్కె దయ్యంలా పట్టుకొంది.**

**"అదేమిటె పందెం వెయ్యకుండా అట్లా కూర్చుండిపోయావు" అని అడిగింది శకుంతలకి అత్తగార్రైన శారదమ్మకి అత్తగారైన శాంతమ్మ.**

శకుంతల జవాబు చెప్పలేదు

**"దబ్బున నాలుగు వేసి నీ జోడీతో మీ అత్తగారి జోడీ చంపు" అని శాంతమ్మ తొందరపెట్టింది మళ్ళీ శకుంతల్ని. నిజానికి శకుంతల రెండు వేస్తే శాంతమ్మ జోడీ చస్తుంది. శకుంతల ఆ పని చెయ్యటం శాంతమ్మకిష్టంలేదు.**

శాంతమ్మ శకుంతల దృష్టిని తన జోడీ మీద కేంద్రీకరించడానికి చేసే ప్రయత్నం శారదమ్మకి నచ్చలేదు. అయితే ఆవిడ తన అత్తగారు తను అంత సూటిగా అనలేదు. అందుకని—

"శకుంతల నా జోడీ చంపితే ఆ పైన ఆ వెనకాతలే ఉండి మీరు రెండు వేసి శకుంతల జోడీ చంపి త్వరగా పండిపోదురు గాని" అంది శారదమ్మ నవ్వుతూ శాంతమ్మతో.

ఆటలో మిగిలిన ఇద్దరు ఎత్తుకు పై యెత్తులు వేస్తున్నా శకుంతల అలీనంగా ఉండిపోయింది. శకుంతలకి నిజానికి అష్టా చెమ్మా ఆట అర్థమై చావదు. అందులో బోలెడు లెక్కలున్నాయి. రెండో ఎక్కం కుణ్ణంగా రావాలి. లెక్కల బాధ పడలేక బాటనీతో ఎమ్మెస్సీ చదివి లెక్కలు మర్చిపోయింది. శేషగిరిని పెళ్లి చేసుకొని బాటనీ మర్చిపోయింది. శకుంతలకి మహా నచ్చని రెండు విషయాల్లో మొదటిది, డాబా మీద వెన్నెల్లో తన భర్తతో కూర్చుని చందమామని చూస్తూ కబుర్లు చెప్పకొంటుంటే శేషగిరి సంభాషణలో శకుంతల అందం, ఆమెకి తన పట్ల గల ప్రేమ కాకుండా అంకెలు గట్రా తీసుకురావటం మొదటిది. అసలు ఏ సమయంలోనైనా కూడికలు, తీసివేతలు, గుణకారాలు, భాగహారాలు చెయ్యాల్సిరావటం రెండోది. అందుకని మామూలుగా శకుంతల ఆటలో పందెం మాత్రం వేస్తూ ఉంటుంది. మిగిలిన ఇద్దరు శకుంతల కాయల్ని వాళ్లకి వీలుగా నడుపుతూ ఉంటారు. ఒకోసారి అత్తగారి కాయ చంపాలా, అత్తగారి అత్తగారి కాయ చంపాలా అన్న సమస్య వస్తూ ఉంటుంది ఆటలో. శకుంతలధర్మంగా ఆ క్రితంసారి తను ఎవరిది చంపిందో వాళ్లది కాక రెండోవాళ్లది చంపుతుంది. ఈరోజు శకుంతల పందెం కూడా వెయ్యకుండా ఆలోచిస్తోంది. ఆ పిల్ల మనస్సక్కడ లేదు.

"నా కాయలాటలోంచి తీసేయ్యండి. నే నోడిపోయాను. నే నోడిపోయాను" అని అంది గంభీరంగా, ఆపైన లేచి తన పడక గదికి వెళ్లిపోయింది.

శేషగిరి సాయంత్రం యూనివర్సిటీనుంచి వచ్చేసరికి శకుంతల తలకి వాసెన కట్టు కట్టుకొని నిలువుగా తిలకపు బొట్టు పెట్టుకొని, కొంగు ముఖంమీద కప్పుకొని పడుకొని ఉంది. అదిచూసి శేషగిరి,

"ఏ కొంప లంటుకున్నాయి?" అని అడిగాడు.

"మీరు వందలకొద్దీ కట్టారుకదా అవి" అని శంకుంతల బుస్సుమని జవాబిచ్చింది.

శేషగిరికి గాలివాటం అర్థం కాలేదు.

"వందలకొద్దీ కట్టానని నేవనలేదే!"

"నేను అంటున్నానుగా."

"ఎందుకంటున్నావ్ ?"

"కట్టారు కనక."

"ఎక్కడ ?"

పెద్దకథ




"వా వెత్తిమీద."

"ఓహో!"

"తెలిసిందా ?"

"ఎందుకీ ధోరణి ?"

"మీరు వందలకొద్దీ కొంపలు కట్టారు కనక."

"ఆ మాట నే నవందే."

"పోనీ నే వంటున్నానుగా."

శేషగిరికి మతి పోయింది. సంభాషణ లైను మార్చాల్సిన అవసరం అర్థమైంది కాస్సేపటికి.

"నేను కట్టలేదుకదా శకూ!" అన్నాడు.

"మరైతే ఎందుకు కట్టలేదు?" శకుంతల ఈసారి బుస్సుమనలేదు. ఆ ప్రశ్నలో అర్థింపు ఉంది. ఆమె కళ్లల్లో నీటిముత్యాలున్నాయి.

"ఎందుకు కట్టాలో తెలియక. మనకి బందర్లో గొడుగు పేటలో ఇల్లుంది. ఈ ఊళ్లో ఈ యిల్లుంది. ఇంకా మరో ఇల్లెందుకు కట్టాలి?" శేషగిరి ఆశ్చర్యంగా అడిగాడు.

"అందుకే" అంది పట్టుదలగా శకుంతల.

"అందుకా! ఎందుకు ?"

"గొడుగు పేటలో ఆ యిల్లు మీ తాతల నాటిది. దాన్ని విప్పి కట్టించారు మీ తాతగారు. ఆవిషయంలో మీ మామ్మగారు చేసిన నిర్వాకం ఏమిటో ఆవిడ నోట మీరెప్పుడూ వినలేదు అనుకొంటాను. ఈ యిల్లు మీ నాన్నగారు కట్టారు. దానికి మీ అమ్మగారు బోలుడు నిర్వాకం చేసి సహాయపడ్డారు.

# మేడ వేసిచూడు

ఈ యింటి కోడళ్లంతా ఇంతో అంతో నిర్వాకం చేసారు. మరినేను. నాకాఅదృష్టం లేదు" అని శకుంతల మళ్లీ ధోరణి మార్చుకొని శేషగిరిని కౌగలించుకొని భోరుమని ఏడ్చింది.

కౌగిలి సుఖాన్ని అరక్షణం అనుభవించాడు శేషగిరి. ఇంతలో శకుంతల ఏడుపు లీలగాను, ఆపైన గట్టిగాను తరువాత భోరుమని వినిపించింది. "ఒహో! ఇది శృంగారం కాదు. విషాదం అన్నమాట" అనుకొని "ఇవాళ నీకేమైంది శకూ! నీ నిర్వాకం ఏడ్చినట్టుందని అన్నారా ఎవరన్నా? నీకు తెలుసునో లేదో కొన్ని ఏడుపులు చాలా అందంగా ఉంటాయి. ద్వాపరయుగంలో సత్యభామ ఏడుపు, ద్వారకా నగరంలో శకుంతల ఏడుపు..." అని అనునయించాడు శేషగిరి.

చక్కటి ఏడుపుతో ఎర్రబడ్డ కళ్లని చక్కగా సగం తెరిచి తల అడ్డంగా ఊపింది శకుంతల. నిర్వాకం గొడవ ఎల్లా మొదలైందని శేషగిరి లాలిస్తూ అడగ్గా అడగ్గా శకుంతల చెప్పడం మొదలు పెట్టింది.

"ఇవాళ అత్తగారు, నేను, అమ్మమ్మగారు కూర్చుని అష్టాచెమ్మా ఆడుతున్నాం. అప్పుడేమో వాళ్లిద్దరు మాటల్ని నిర్వాకం వేపు మళ్లించారు. గొడుగుపేట ఇంటి విషయంలో అమ్మమ్మగారి నిర్వాకం గురించి అమ్మమ్మగారు చెప్పారు. ఈ యింటి విషయంలో తనెంత కష్టపడ్డారో అత్తగారు చెప్పారు. ఓపిగ్గా విన్నాను. ఆపైన సంసారంలో ఏదైనా పొదుపు, నిర్వాకం జరిగితే ఆడదానివల్లే జరగాలి అని హెచ్చరించారు. చివర 'నువ్వూ నీ మొగుడు డబ్బు సినిమాలకి హోటళ్లకి తగలేస్తారు. పదిహేడేళ్లగా ఉద్యోగం చేస్తున్నాడన్న మాటేకాని చిల్లిగవ్వ దాచలేదు. మీకున్న ఇద్దరాడపిల్లలు పెళ్ళికి చప్పున ఎదిగొస్తారు. జాగ్రత్త! అంటూ నాకు కడుపునిండా గడ్డి పెట్టారు."

"నే ననుకొంటూనే ఉన్నాను. వీధిగేటు తెరిచి ఇంట్లోకి వస్తూనే ముందువేపు ఒక్క గడ్డిపరకైనా లేదేమా అనుకొన్నాను. వేనుకవేపు కూడా ఉండి ఉండవు. నేనింకా అటుకేసి వెళ్లలేదు. అందుకని నిర్ధారణగా

(60 వ పేజీ చూడండి)



# గణపతి ఎవరు?

'విగతోనాయకః ప్రభురస్య స్వతంత్రాత్ వినాయకః' — 'వినాయకుడు' అనగా నాయకుడు లేనివాడు. సర్వ స్వతంత్రుడు అని అర్థము. "వినయతి శిక్షయతి దుష్టాన్ విఘ్నాం శ్చేతి విఘ్నరాజః"—దుష్టులను శిక్షించి, విఘ్నముల నణచువాడు 'విఘ్నేశ్వరుడు' అని అర్థము. 'గ' అనగా బుద్ధి. 'ణ' అనగా విద్య లేక వివేకము. 'గణపతి' అనగా విద్యా వివేకముల కధిపతి అని అర్థము.

వినాయకుడు మొదట ఓ ద్రావిడ దైవమని ఒక వాదమున్నది. మూషిక వాహనుడైన గణపతి రాత్రిని పారద్రోలుమన్న సూర్యుడనే వాదన కూడా యున్నది. మూషికం రాత్రికి చిహ్నమనీ, దాన్నణచిన గణపతి వెలుగు తేడు సూర్యుడని భావన. ఎలుక వాహనమున్నందున ఈ తొండపుసామి 'జంతువుల ఆరాధన' నుంచి ఆవిర్భవించినాడనే మరొకవాదము.

'విష్ణువు' స్వయంగా 'వినాయకుడు'గా జనన మొందెనని "బ్రహ్మ వైవర్తము" నందొక గాథ కలదు. పార్వతీదేవి పుత్రార్థియై పుణ్యకవ్రత మొనరించగా శ్రీ కృష్ణుడే స్వయంగా పార్వతీ తనయునిగా జననమొందెనట. కుమారుని జన్మదిన వేడుక సందర్భంగా విచ్చేసిన సకల దేవతాగణము వినాయకుని దీవించగా శనేశ్వరుడు తన భార్యవల్ల తనకు కలిగిన శాప ఫలంగా తను చూచిన వారి తల బ్రద్దలగునని శంకించి వినాయకుని చూచుటకు సంకోచించెను. పార్వతి అతని మనోవేదనను గుర్తించి 'విధివశం ప్రకారం జరిగేది జరుగక మానదు' అని శనిని తన కుమారుని చూచుటకు అనుమతించగా, శనైశ్వరుని దృష్టిసోకిన ఫలితంగా వినాయకుని తల బ్రద్దలుకాగా ఆ తల స్థానములో గజశిరస్సు అతికించబడినదని చెప్పబడినది.

వినాయకుడు విద్యాధి దేవతగా, భారత రచనా లేఖకుడుగా, విఘ్నరాజుగా, గణాధిపతిగనేగాక పెండ్లి పెద్ద కూడ అని చెప్పబడే మరొక గాథను పరికిద్దాం :

దశరథ మహారాజునకు కలుగబోవు సంతతిచేత తనకు మృత్యువు సంభవించగలదని యెరింగిన లంకాధిపతి రావణాసురుడు దశరథుని వివాహమునకు ముందుగా దశరథుని ఆయనకు పత్నులు కానున్న ముప్పురు దేవేరులను ఎత్తుకొనిపోయి నలుగురినీ నాలుగు పేటికలలో నుంచి నదీప్రవాహంలో వదిలి వేసెనట. ఆకాశాన మూషిక వాహనుడై పయనిస్తున్న వినాయకుడు ఈ వింత చోద్యం తిలకించి కొట్టుకొని పోవుచున్న పెట్టెలను ఒడ్డుకు చేర్చి ఆ సుముహూర్తమునకే దశరథునికి తాను పెండ్లి పెద్దగా నుండి వివాహం జరిపెనని గాథ గలదు. అలాగయితే రామావతారానికి 'గ్రీన్ సిగ్నల్' ఇచ్చినవాడు మన వినాయకుడే అవుతాడుమరి!



వినాయకుని ఆకృతి వికృతంగా తోచినా స్వరూప రహస్యాలను పరిశీలిస్తే అందులోని అంత రార్థం సుబోధకం కాగలదు. గజము బలానికీ, బుద్ధికీ చిహ్నం. గజశిరస్సు బుద్ధి కుశలతకు సంకేతం. సృష్టిలో చిన్నప్రాణి ఎలుక. పెద్ద ప్రాణి ఏనుగు. ఋషి పుంగవులు శ్లాఘించిన వి రూపం సర్వవ్యాపకమై వదనటానికి గజముఖం మూషిక వాహనం సంకల్పించబడింది. 'శుక్లా బరధరం విష్ణుం' — శ్లోకములో 'విష్ణుం' అ దానికి సర్వవ్యాపకమనేగదా అర్థం. వినాయకు హస్తములోని పాశం మోహాన్ని హతమార్చేది మరొక చేతిలోని అంకుశం విశ్వ నియంతృత సంకేతం. వరహస్తం జనవాంఛా ఫలప్రదం అభయ హస్తం భయోపశమన చిహ్నం. వ తుండం విచక్షణాశక్తికి సంకేతం. నాగము కా ద్యోతకమైన మృత్యువునకు సంకేతం. అంతేగా సర్ప జందెం అనవరతబ్రహ్మచర్యానికి సాక్ష్యం "శూర్పకర్ణం—సమాశ్రిత్య త్యక్తామల వికారకమ్' అనేడి "శ్రుతి" ప్రకారం శూర్పకర్ణుడైన గణపతి నేడితే పాపాలు పటాపంచలై పోతాయని అర్థం. ఇ లంబోదరార్థం అంటారా! ఈ విశాల విశ్వమూ బ్రహ్మ స్వరూపమైన గణపతి ఉదరంలో ఉద్భవించి నశించుచున్నది. అనగా సృష్టి స్థితిలయాలన చెందుతూ ఉన్నదనే లంబోదరార్థం. గణపతి గా నుండి మనం నేర్చుకోవలసిన నీతి మరొకటుంది నిర్మల మనస్సు కలవాని బుద్ధి వికసిస్తుంది. బుద్ధి వికాసంతో సిద్ధి, బుద్ధి, సిద్ధులు కలవారికి క్షేమం లాభం కలుగకమానవు. ఈ బుద్ధి, సిద్ధి, క్షేమ లాభాలు సాధించినవాడు కనుకనే అవన్నీ మనకూ ప్రాప్తింప చేస్తాడని సిద్ధివినాయకుని శ్రద్ధతో ఇల స్తుతిద్దాం :—

"ఏకదంతం మహాకాయం తప్తకాంచన

సన్నిభం

లంబోదరం విశాలాక్షం వందే హం గణ

నాయకం !"

— మారుతి ★




వినాయకునికి సంబంధించిన రకరకాల కథలు

## సీరియల్ ప్రారంభం!



శ్రీమతి కళ్యాణి సోమరాజు

కందర్ప దర్ప హర సుందర దివ్యమూర్తే!
కాంతా కుచాంబురుహ కుట్మలలోల దృష్టే!
కల్యాణ నిర్మల గుణాకర! దివ్యకీర్తే!
శ్రీ వేంకటాచలపతే! తవ సుప్రభాతమ్॥

శారదమ్మ కంఠం భక్తితో ఆలపిస్తుండగానే, బయట సైకిల్ గంట దానితోపాటు "పోస్ట్!" అన్న కేక వెనువెంటనే వినిపించాయి

**శారదమ్మ పూజ మధ్యలో లేవాల్సి వచ్చినందుకు చిరాకు పడినా ఆ వచ్చింది పోస్ట్‌మాన్ కాబట్టి లేచివెళ్ళి వీధి గేటు తీసింది.**

పోస్ట్‌మాన్ ఒక బరువైన విదేశీ కవరు చేతిలోపెట్టి గంట మ్రోగించుకుంటూ వెళ్ళిపోయాడు!

ఆ ఉత్తరం చూడగానే అది తన చెల్లెలు న్యూయార్క్ నుంచి వ్రాసినదని గ్రహించింది శారదమ్మ! పూజ మధ్యలో ఆపేసిన విషయం గుర్తు వచ్చి కవరు చించకుండా అలమార్లో దాచేసి అన్య మనస్కంగా పూజ ఎలాగో అయిందనిపించి, గబగబ కవరు అందుకుంది.

ప్రియమైన అక్కయ్యకి!

ఈ మధ్య చాలా రోజులైంది కదూ నీకు ఉత్తరం వ్రాసి. ప్రతిక్షణం ఏదో హడావిడి, తీరుబడిలేకుండా గడిచిపోతున్నాయంటే నువ్వు నమ్మతావు కదూ! అందులో ఈ మధ్య మానసికంగా కూడ చాలా చిత్రవధను అనుభవిస్తున్నానేమో, ఏం చేయాలో తెలియక అయోమయ పరిస్థితుల్లో రోజులు గడుపుతున్నాను.

"ఇద్దరు పిల్లలు వుండి, భర్త మంచి పొజిషన్‌లో రెండు చేతులా డబ్బు సంపాదిస్తుంటే—నీకు కలిగే మానసిక వ్యధ ఏమిటి" అని నువ్వు నన్ను ప్రశ్నించవచ్చు!

ఒక్కొక్కప్పుడు నువ్వే నా కంటే అదృష్టవంతురాలివేమో అనిపిస్తూ వుంటుంది. పిల్లాపాపలు లేకుండా ప్రశాంతంగా జీవిస్తున్నావు.

పిల్లలు చిన్నప్పుడు ఎంత ఆనందాన్ని మనకందిస్తారో, వాళ్ళు పెద్దవాళ్ళు అవుతున్నకొద్దీ అంత చికాకులు, సమస్యలు మనం ఎదుర్కోవాలేమో, అని ఈమధ్య నాకనిపిస్తోంది!

బాబు ఫిఫ్త్ స్టాండర్డ్ చదువుతున్నాడు. అయితే నాకు ప్రస్తుతం కలిగిన మానసిక వ్యధ వాడిమూలంగా కాదులే, అది నీ ముద్దుల కూతురు, మా ముద్దుల కుమార్తె దీప తెచ్చిన సమస్య! దానికి పద్దెనిమిది నడుస్తోంది. అయిదారు నెలల నుంచి ఉద్యోగంలో చేరిందికూడాను. దాన్ని ఉద్యోగంలో చేర్పించటం నాకు పెద్ద ఇష్టంలేదు. అయినా మీ మరిదిగారి పట్టుదల, దీప మొండితనం వలన నేను నోరు మూసుకోవాల్సి వచ్చింది. అయితే ఈమధ్యే అది నెలతప్పిందని మా లేడీ డాక్టర్ చెబుతుంటే కొండ మీదపడ్డట్లు క్రుంగిపోయాను! దాన్ని అడిగితే, అది చెప్పిన సమాధానం విని మరింత నీరసపడ్డాను! అది ఏం చెప్పిందో తెలుసా?

"ఏమో మమ్మీ! నిజంగా నాకేమి తెలియదు. బహుశ పీటర్ అపార్ట్‌మెంట్‌లో ఒక నైట్ వుండిపోయాను చూసావా, ఆ రాత్రి ఏమైన జరిగిపోయిందేమో... దానికింత బెంగ ఏముంది... యబార్షన్ వుందిగా" అంటూ తేలిగ్గా తీసేసి పారేసింది.

నాకేం చెప్పాలో తెలియలేదు.

అక్కా! నీకు తెలుసుగా, మనతోపాటు చిన్నప్పుడు చదువుకున్న 'దుర్గ'కి ఇలాటి పరిస్థితే వస్తే, తల్లిదండ్రులకి, సంఘానికి భయపడి ఎలా ఆత్మహత్య చేసుకుందో! అలాటి పరిస్థితి నాకూతురికి కలగాలని కోరుకోవటంలేదు. కాని మరీ ఇంత నిర్భయంగా నాకే సలహా ఇస్తూ, నన్నూ ఓదార్చే, సిగ్గులేనితనానికి నేనెంతగానో విచారిస్తున్నాను.

అయితే అది కోరుకున్నట్లు యబార్షన్ అయిపోతే, ఈ విషయం నీవరకు వచ్చి, నిన్నుకూడ

బాధించకపోదును. ఇప్పుడు యబార్షన్ చేయటం తల్లికి ప్రమాదం అని ఇద్దరు ముగ్గురు లేడీ డాక్టర్స్ చెప్పాక మాకీ సమస్య వికృతరూపం ధరించింది. అయితే ఆ విషయం ఈ ఇంట్లో నన్ను బాధిస్తున్నట్లు ఆ తండ్రీ కూతుళ్ళను బాధించటంలేదు. "ప్రతిదాన్ని భూతద్దం క్రింద చూసి, దుడుసు కుంటావ్, ఇప్పుడేమైంది. ఏదో పొరపాటున జరిగింది. దూరంగా ఎక్కడకైనా తీసుకెళ్ళి డెలివరీ అయ్యాక వద్దాం" అంటూ లోకం తెలియని మీ మరిదిగారి కబుర్లు నన్ను ఓదార్చలేకపోయాయి.

దానికి తోడు మా స్నేహితుల్లో ఈ విషయం పాకితే ఇక ఈ జన్మకు దానికి పెళ్ళికాదు. ఈ మధ్య ఒక తెలుగు కుటుంబంలో పరిచయం అయింది. వాళ్ళ అబ్బాయి ఈ దేశంలోనే ఎక్కడో జాబ్ చేస్తున్నాడు. వాళ్ళకు దీప చాలా నచ్చింది. మంచిరోజు చూసి పెళ్ళి సెటిల్ చేసుకుందాం అనుకుంటుండగా ఈ ఘోరం జరిగింది. పోని ఆ పీటర్‌నే పెళ్ళి చేసుకుంటావా? అని అడిగితే, నామీద ఇంత ఎత్తున ఎగిరింది. "పెళ్ళి అంటే ఏమనుకుంటున్నావూ? నాకు అవతల వ్యక్తి అంటే ఇష్టం వుండక్కర్లేదా...ఏదో నాతోపాటు క్లర్క్‌గా పనిచేస్తున్న వాడిని పెళ్ళి చేసుకోవటమా!" అంటూ! దానితో వాదించలేక నోరు మూసుకున్నాను.

రాత్రి పగలు ఈ విషయం గురించి బెంగ పడ్డాక, చివరకు నాకు తోచింది "దాన్ని నీ దగ్గరకు పంపటం కంటే మరో దారిలేదని." అదంటే నీకు వల్లమాలిన ప్రేమని నాకు తెలుసు. నువ్వు తప్పితే ఇంకెవ్వరూ దాన్ని కడుపులో పెట్టుకొని ఆదుకోరని కూడ నా కనిపించింది! 'నాలాటి చెల్లెలెందుకు వుందా!' అని నువ్వు తిట్టుకుంటావేమో నాకు తెలియదు. కాని ఈ సమస్య ని పాదాల ముందు వుంచుతున్నాను. నిన్ను కూడా ఈ చిక్కుల్లోకి లాగుతున్నందుకు క్షమించు! దీప కూడ నీ దగ్గరకు రావటానికి ఒప్పుకుంది. పురిటి ఖర్చు అంతా నేను భరిస్తాను. దాని పురుడు అయ్యే వరకు ఎవరికి తెలియకుండా అక్కడే వుండనీ ... ఈ విషయం ఆలోచించి నీ సమ్మతిని తెలియపరిస్తే దీపను పంపిస్తాను.

నన్ను క్షమించు!

నీ
భాను.

ఉత్తరం మడిచి అలసటగా పడకుర్చీలో వాలింది శారదమ్మ! అర్థం తెలియని బెంగతో మనసు బాధగా మూలిగింది. కళ్ళముందర అర్థిస్తూ చెల్లెలి రూపం కనిపించింది. దానికి నేను, నాకు అది తప్ప ఏ తోడబుట్టినవాళ్ళు లేరు అనుకొంది జాలిగా!

శారదమ్మ, భానుమతి ఒకే తల్లిదండ్రులకు పుట్టినా మొట్టమొదటినుంచి వారి జీవితాలు విభిన్న మార్గాల్లో నడిచాయి! శారదమ్మని మేనరికం ఇచ్చారు, అబ్బాయి చదువుకోకపోయినా ఆస్తి చాలా వుందని. పెళ్ళి అయిన మూడేళ్ళకే పిల్లాపాపలు లేని శారదమ్మను ఒంటరిదాన్ని చేసి చనిపోయాడు భర్త. అప్పటినుంచి ఆ పల్లెటూళ్ళోనే వుంటూ ఆస్తి వ్యవహారాలు చూస్తూ దైవధ్యానంలో పొద్దు గడుపుతూంది శారదమ్మ. భానుమతికి, ఆస్తి లేదు కాని మంచి ఉద్యోగంలో వున్న రామూర్తి కిచ్చి పెళ్ళి చేసారు. పెళ్ళి అయిన వేళావిశేషంవలనో, రామూర్తి తెలివితేటలువలనో, ఫారెన్‌లో మంచి ఉద్యోగం రాగానే, అక్కడికి కుటుంబంతోసహా వెళ్ళిపోయి అక్కడే సెటిల్ అయ్యాడు. భానుమతి ఆ తరువాత ఇండియాకి రావటం చుట్టంచూపే అయిపోయింది. దీప పుట్టిన కొత్తలో ఒక్కసారి వచ్చి అక్క దగ్గర నెలరోజులుండి వెళ్ళింది! పిల్లలులేని శారదమ్మకు దీప ఆటపాటలతో లోకం మరిచిపోయేది. ఆ తరువాత భర్తలో, దీప తరువాత పుట్టిన బాబుతోను భానుమతి మళ్ళీ వచ్చినా, శారదమ్మ చెల్లెల్ని ఎక్కువ రోజులు వుంచుకోలేకపోయింది. మరిదిగారి తొందర, పట్టుదలతో నెలరోజులు గడవకుండానే ఫారెన్ వెళ్ళిపోయింది! వాళ్ళిద్దరిమధ్య ఉత్తరాల వారధి మాత్రం పటిష్టంగా వుండటంవలన ఒకరి కష్టసుఖాలు ఒకరితో చెప్పుకోనేందుకు వీలైయ్యేది! చాలా రోజులకు చెల్లెలు దగ్గరనుండి వచ్చిన ఉత్తరం ఎప్పటిలా ఆనందాన్ని నింపలేకపోయింది శారదమ్మలో. "దీపకిలాటి రాకూడని కష్టం వచ్చింది" అనుకోకుండా వుండలేకపోయింది శారదమ్మ. "ఈ సమస్య దీపని ఇక్కడకు పంపగానే తేలిపోయేంత తేలికదా! ఆ తరువాత కన్యగానే తల్లి అయిన ఆ పిల్లను ఏ మగాడు పెళ్ళాడుతాడు? అయినా ఈ పల్లెటూళ్ళో దీప సంగతి తెలిస్తే తనని కాకుల్లా పొడవరూ ..." శారదమ్మ ఊహలలో అస్తవ్యస్తంగా వుండగానే గేటు చప్పుడైంది.

"రా ... రా చంద్రం ... మాంచి ఎండలో బయల్దేరావే" అంటూ శారదమ్మ ఉత్తరాన్ని పక్కనే పెట్టి కుర్చీలో లేచి కూర్చుంది.

"విజయవాడ వెళ్ళివస్తున్నాను. ఏదో పొలం పనిమీద ..." అంటూ చంద్రం అలసటగా కుర్చీలో కూర్చుండిపోయాడు.

"కొంచెం దాహం తీసుకురానా ?" శారదమ్మ ఆపేక్షగా చూస్తూ అడిగింది.

"వద్దమ్మా! ఇంటికెళ్ళి భోజనం చేయాలి. అన్నట్టు మీ పొలం శిస్తు కట్టేసాను. కాస్త అక్కడే ఆలస్యం అయింది." అంటూ బ్యాగ్‌నుంచి కాగితాలు తీసి శారదమ్మ కందించాడు.

"నా పొలం వ్యవహారాలన్ని నీ మెడకు చుట్టాను. అయినా, ఏదో మగాడివి అన్నీ నువ్వు దిద్దుకోబట్టి, సరిపోతోంది ... లేకపోతే ఎన్ని అవస్థలు పడేదాన్నో ..."

"ఫరవాలేదమ్మా! ఇదేం అంత శ్రమ ..." హఠాత్తుగా చంద్రం దృష్టి గాలికి రెపరెప లాడుతున్న పేపర్లమీద పడి "అన్నట్టు మీ చెల్లెలుగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందిలా వుంది ... ఏమిటి విశేషాలు ... అంతా కులాసానా?" అడిగాడు చంద్రం.

ఎప్పుడు చెల్లెలు దగ్గర నుంచి ఉత్తరం వచ్చినా, శారదమ్మ చంద్రానికి అందులో విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పి, తన ఆనందాన్ని అతనితో పంచుకునేది. కాని ఈ సారి శారదమ్మ ముభావంగా "వచ్చింది ... ఇప్పుడే!" అనేసి వూరుకుంది.

చంద్రం రెట్టించలేదు.

శారదమ్మకా క్షణంలో తన మనసులో బాధనంతా చంద్రం ముందు వెళ్ళగక్కి ఉపశమనం పొందాలనివుంది. కాని ఈ విషయం చిన్నవాడు అతను తననెలా ఓదారుస్తాడు.

"ఏమ్మా — అలా వున్నారు? ఒంట్లో కులాసాగా వుందా!" శారదమ్మ అన్యమనస్కంగా



న్యూట్రామూల్ 'వస్తాదులు'
వర్షాకాలపు జబ్బుల్ని ఎదుర్కోగలరు.

దీన్లోగల ప్రొటీన్లు, విటమినులు, ఖనిజాలూ
శరీరంలోని రోగనిరోధక తత్వాన్ని పెంపొందిస్తాయి.

Nutramul
AMUL'S NOURISHING DRIN

న్యూట్రామూల్ 'వస్తాదు'వి అవ్వు

అమూల్ వారి
న్యూట్రామూల్

మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్.

daCunha-GCM-29 Tel

వుండటం చంద్రానికి కలవరపాటు కలిగించింది.

శారదమ్మ కళ్ళనీళ్ళు జారి చెక్కిళ్ళమీద పడ్డాయి. మాట్లాడకుండా ఉత్తరం చేతిలో పెట్టింది.

చంద్రం క్షణంసేపు తటపటాయించి చివరకు చదివాడు.

"బాగుందమ్మా! ఈ చిన్న విషయానికి ఎందుకంత బాధపడుతున్నారు" ఉత్తరం మడిచి శారదమ్మ కందిస్తూ అన్నాడు.

శారదమ్మ నివ్వెరపోతూ చంద్రం వంక చూసింది. "ఇది నీకక్కడ చిన్న విషయంలా వుందా! పెళ్ళి కాకుండా ఒక పిల్ల గర్భవతి అయిందంటే... ఎంత తప్పు. దాని జీవితం ఇంక ఏముంది? ఎవరు పెళ్ళి చేసుకుంటారు? అవన్నీ మీ తరానికి సమస్యల్లా కనిపించవా?" శారదమ్మ ప్రశ్నించేసరికి, చంద్రానికి ఏం చెప్పాలో తెలియలేదు. "అలా అని కాదమ్మా! సమస్యలు ఏ కోణంతో చూస్తున్నారో దాన్నిబట్టి చిన్నది, పెద్దది అవుతుంది. కాని ప్రతి సమస్యకి పరిష్కారం తప్పకుండా వుంటుంది! ఈ విషయంలో మీరంతగా బాధపడక్కర్లేదు. ఆ అమ్మాయిని రానివ్వండి. దానిమూలంగా ముందు మీ చెల్లెలుగారు మనశ్శాంతి పొందుతారు. ఆ అమ్మాయి రావటంవలన మీకు సమస్యలేమైనా వస్తాయని మీరు భయపడక్కర్లేదు... మనం చేసే ప్రతి పనిని ఎవరో ఒకరు మంచిగాను, చెడ్డగాను విమర్శిస్తూనేవుంటారు... కాబట్టి లోకం ఏమనుకుంటోందని బెంగపడద్దంటాను. పెళ్ళి విషయం ప్రస్తుతం అప్రస్తుతం. ఆ అమ్మాయి తనంతటతాను తీర్చుకోగలదేమో... లేక కాలమే తీరుస్తుంది..." చంద్రం తేలిగ్గా తీర్పు చెప్పినప్పటికి శారదమ్మలో భయం పూర్తిగా పోలేదు!

## 2

దీప రావటానికి తన అభ్యంతరం ఏమీలేదని వ్రాసాక, దీప వస్తున్నట్టు కేబుల్ అందింది శారదమ్మకు. ఇక శారదమ్మ కంగారుకు అంతం లేదు. పాలేర్లను పురమాయించి ఇళ్ళు, వాకిళ్ళు శుభ్రంగా బూజులు దులిపించి, కడిగించి, ముగ్గులు పెట్టించింది. చంద్రాన్ని విజయవాడ వెళుతుండగా పూలగుడ్డలు తెప్పించి గుమ్మాలకు కట్టింది. ప్రత్యేకంగా ఒక గది దీప పడుకోటానికి చక్కటి పరుపు అదీవేసి తయారు చేసింది. దీప రాక మనసులో ఒక మూల ఆనందంగా వున్నా ఈ విధంగా కాక మరో విధంగా అయితే ఎంత బాగుండును అని గుర్తు వచ్చినప్పుడల్లా అనుకునేది శారదమ్మ!

దీప ఇంక నాలుగురోజులకు వస్తుందనగానే, శారదమ్మకి ఒళ్ళు నొప్పులు, జలుబుతో జ్వరం ఆరంభించింది. జ్వరం రెండు రోజుల్లో తగ్గినా, నీరసం తగ్గలేదు. దీపను తీసుకురావటానికి హైద్రాబాద్ వెళ్దామనుకున్న శారదమ్మ ఒంట్లో ఓపికలేక మానుకోవలసి వచ్చింది. చంద్రాన్ని, దీప ఫొటో ఒకటి ఇచ్చి, తను రాలేకపోయానని చంద్రం తను పంపిన మనిషేనని దీపకు ఉత్తరం వ్రాసి, హైద్రాబాద్ పంపింది!



# ప్రేమ క్షేత్రం

చంద్రం ఏర్‌పోర్ట్‌కి వెళ్ళేసరికి ప్లేన్ లాండ్ అవటం ప్రయాణీకులు ఒక్కొక్కరే దిగటం జరిగింది! నలుగురైదుగురు తరువాత బెల్‌బాటమ్స్‌తోను, మెడలో బ్యాగ్, కళ్ళకు గాగుల్స్ పెట్టుకొని, జుట్టు పొట్టిగా విరబోసుకొని, పరిసరాలన్నీ పరుగ్గా చూస్తూ నడిచివస్తున్న అమ్మాయిని దీపగా గుర్తుపట్టాడు చంద్రం!

"మీరు ... దీప అనుకుంటాను?" ఆ యువతి ఒక్కసారి కంగారుగా చూసి "ఔను!" అంది. తరువాత శారదమ్మ ఇచ్చిన ఉత్తరం దీప కందించాడు!

దీప ఉత్తరం అంతా చదివి, "పెద్దమ్మ కెలావుంది ఇప్పుడు?"

"ఫరవాలేదు ... కొంచెం నీరసంగా వుంది. అందుకే రాలేదు."

## స్థిమితం

మన దినదిన వ్యవహారాల్లో
క్షణక్షణ జీవన కార్యకలాపాల్లో
అన్నిటా పాటించవలసినది — ఒకటున్నది
అది — మితం!
మితం వలన మనసుకు చేకూరేది —
ఆలోచనా క్రమాన్ని హృదయగతం చేసేది —
అన్నిటా ఆరోగ్యాన్ని కల్గించేది —
ఒకటున్నది అది — స్థిమితం!!
మితం పాటిస్తే మనిషికి చేకూరేది — స్థిమితం!
స్థిమితం చేకూరాలంటే
మనిషి పాటించాల్సింది — మితం!

— కాటిపాకం లింగన్న

దీపని ఒక పెద్ద హోటల్‌కి తీసికెళ్ళాడు చంద్రం. అక్కడ దీప టిఫిన్ తీసుకొని కాస్త రెస్ట్ తీసుకున్నాక టాక్సీలో తమ వూరు బయలు దేరారు!

చంద్రం అవసరం అయినంతవరకు మాట్లాడటం దీపకెంతో నచ్చినా, మరీ అంత ముభావంగా వుండటంవలన ప్రయాణం అంతా బోరుకొట్టింది! దారిలో దీప కల్పించుకొని చాలా మాట్లాడింది! కాని చంద్రం 'ఓహో' "అలాగా" అంటూ సమాధానాలు చెప్పి, దీపకి మాట్లాడే అవకాశం లేకుండా చేశాడు!. దీప విసుగ్గా సీటు మీద వెనక్కువాలి, మధ్య మధ్య తను తెచ్చుకున్న మాగ్జైన్స్ చూడటంలో మునిగిపోయింది. టాక్సీ విజయవాడ దాటి, తమ వూరి పొలిమేరల్లోకి వచ్చాక దీప పుస్తకాలు పక్కన పడేసి కారులోంచి బయటకు చూసింది. పచ్చని చేలు చిగురు గాలికి చిన్నగా ఊగుతూ దీప రాకకు ఆనందంతో నాట్యం చేస్తున్నట్లున్నాయి. చిన్న పంటకాలవలు వూరిని చుట్టుతూ చుట్టుకొని ప్రవహిస్తున్నాయి. వూరి మొదట్లో ప్రశాంతంగా నిలబడివున్న దేవాలయం, దాన్నిపక్కన చిన్న కోనేరు, దీప మనసు ప్రయాణం వలన కలిగిన అలసట అంతా సేదతీర్చేలా వున్నాయి పరిసరాలు.

ఈలోగా కారు చిన్న పెంకుటింటిముందు ఆగటం దీప గమనించలేదు. శారదమ్మ వీధిలోనే ఎదురువచ్చి దీపని ఆపేక్షగా కౌగలించుకొంది!

శారదమ్మ ఎదురుచూసిన దీప రావటమైతే జరిగింది! కాని శారదమ్మ ఎదురుచూడని విషయం, ఆ వూళ్ళోవాళ్ళు అప్పుడే ఏవో కథలు అల్లి ప్రచారం చేయటం. కొంతమంది ఆ మరునాడే వచ్చి మొహంమీద అడిగేయటంకూడా జరిగింది. క్షణంసేపు శారదమ్మకి ఎలా చెప్పాలో అర్థం కాలేదు. తను అప్పటికప్పుడు సృష్టించిన కథ చెప్పేసింది.

మరునాడు చెరువుల దగ్గర, బావుల దగ్గర ఆడంగుల మధ్య ఇదే చర్చ...

"ఆ అమ్మాయి ఎవరో కాదుట చెల్లెలు కూతురుటే శారదమ్మకి. పెళ్ళి అయిన కొత్తల్లోనే మొగుడు పోయాడుట. మొగుడు పోయేసరికి ఆ అమ్మాయికి రెండునెల్ల కడుపట. కాస్త గాలి మార్పు అని, బాధ మర్చిపోయినట్లువుతుందని ఈ దేశం పంపారుట ..."

"అయినా అదేం సోద్యమే తల్లీ... చూడబోతే ఎక్కడ అయినా వుందా. ఆ మొగరాయుడిలా ఆ వేషం ఏమిటి, ఆ షోకులేమిటి?" ఆ పల్లెటూరి స్త్రీల సానుభూతి దీపకు దక్కలేదు.

అయితే దీని మూలంగా తృప్తిపడి వూరు కున్నారు. శారదమ్మను ప్రశ్నించటం మానుకున్నారు.

దీపకు మాత్రం ఒక్కసారి మరో లోకానికి వచ్చి పడ్డట్లైంది. అన్నీ అధునాతన సౌకర్యాలతో, నీట్‌గా వుండే తను ఇల్లు, ఆ పరిసరాలు, గలగల మాట్లాడే తన స్నేహితులు అంతా ఒక్కసారి గుర్తువచ్చి బెంగని కలిగించేవి! కాని తల్లిలా ఎక్కువ ఆపేక్ష, అభిమానం కురిపిస్తున్న శారదమ్మ ప్రేమలో అన్నీ సర్దుకుపోయేవి. అయితే తన అలంకరణ విషయంలో మటుకు త్వరగా రాజీ పడలేకపోయింది. తను వెంట తెచ్చుకున్న బెల్ బాటమ్స్, లాంగ్ డ్రెసెస్, మాక్సీలు చాలా కొన్నే అయినా దీప వాటిని వేసుకోవటంలోనే ఎక్కువ శ్రద్ధ చూపించేది!

ఏనాడైనా కాస్త చల్లగాలి కోసం బయటకు వెళితే పదిమంది వింతజంతువును చూసినట్లు చూడటం, తన ముందే నవ్వటం, ఇవన్నీ దీపకు చాలా కోపం, బాధ కలిగించేవి!

(ఇంకా వుంది)

# సులభంగా జీర్ణమయే బియ్యపు సీరియల్
# మీ పాప ఆహారానికి తెస్తుంది కొత్తదనం



మీ పాపకి 4 నెలలు వస్తే, అతని ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టండి. అతనికి మొట్టమొదటగా ఉపయోగించతగిన ఘన పదార్థం నెస్టమ్ బేబీ సీరియల్, రైస్.

జీర్ణం చేసుకోవడం సులభం
బియ్యం నుంచి తయారయిన సీరియల్ జీర్ణం చేసుకోడానికి సులభమయినది.

పలురకాలు
పాలతో నెస్టమ్‌ని యివ్వడం ప్రారంభించండి. పాప పెరుగుతూ వుంటే, ఆహారంలో నెస్టమ్‌ని ఉడకబెట్టిన పండ్లు, వండిన మరియు మెత్తగా చేసిన కాయగూరలు, పప్పులతో పలురకాలుగా ప్రవేశపెట్టండి.

## నెస్టమ్®
## బేబీ సీరియల్
## రైస్

తయారుచేయడం సులభం!



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి.



నెస్టమ్ చేర్చండి కలపండి.



తినిపించుటకు తయారు









SAA/FSL/N/1564/TEL

# మువ్వల మురళి



సీరియల్ — ఆర్. సంధ్యాదేవి

( గత సంచిక తరువాయి )

ఆమెను బలవంతంగా తనవైపుకి తిప్పుకుని—

"రోజా! నువ్వు ఎప్పుడూ ఒంటరితనంతో బాధపడకూడదు. నువ్వు అలా బాధపడితే నేను చూడలేను. అమ్మకూ, నాన్నకూ చెప్పలేదని నీ సందేహమా! హరిత ఏమైనా అంటుంది అని నీ భయమా! ఎలాటి అనుమానాలేం నీకు వద్దు. కొద్ది రోజులు ఓపికపట్టు, నీ గురించి అందరికీ చెప్పేస్తాను. అమ్మా, నాన్నకి నిజంగా నేను అంటే ఇష్టం వుంటే తప్పక ఒప్పుకునితీరతారు ఇక హరిత సంగతా! ఇంకేమంటుంది! నా మాట నువ్వు నమ్ము. ఎవరు ఏమన్నా నిన్ను మాత్రం నేను దూరం చేసుకోను." అతని కంఠస్వరం స్థిరంగా పలికింది.

అతని మాటలు ఒక్కొక్కటే వింటూనే ఆపుకోలేని దుఃఖంతో వెక్కి వెక్కి ఏడుస్తూ, నిలబడే శక్తి లేనట్టు అతని గుండెలమీద తల వాల్చేసింది.

"రోజా!" అంటూ ఆమెను ఓదార్చసాగాడు.

కొద్దిక్షణాల తరువాత తనకుతాను దుఃఖాన్ని మింగుకుని, అతని చేతులు విడిపించుకుని మెల్లగా చెప్పింది — "కూర్చోండి. కాఫీ తెస్తాను" అంటూ వెనుతిరిగి వెళ్ళబోతుంటే, వెళ్తున్న ఆమెను ఏటుక్కున చెయ్యిపట్టి ఆపేశాడు వెళ్ళకుండా.

"ఇప్పుడు కాఫీ ఏం వద్దు. ఇలా నా దగ్గర కూర్చో" అంటూ తను అక్కడ మంచంమీద కూర్చుంటూ రోజాని తన పక్కన కూర్చోబెట్టు కున్నాడు.

## 26

హరిత ఆ రోజు జరిగినది అంతా మర్చిపోవ డానికే నిశ్చయించుకుంది.

ఆయన చెప్పిన మాట నిజమే! భార్యగా ఆయన్ను నేను అర్థం చేసుకోకపోతే ఇంకెవరు అర్థం చేసుకుంటారు, అనుకుంది.

సినిమాకు ఇంకా చాలా టైము వుంది కాబట్టి, స్నానంచేసి ఆర్గండీవాయిల్ చీర కట్టుకుని, తలలో పూలు పెట్టుకుని, ముస్తాబు అయి భర్త రాకకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

కారు ఆగటంతోనే గుమ్మంవైపు చూసింది. కృష్ణసుమంత్ లోపలకి వస్తూనే హరితను చూసి చిరునవ్వు నవ్వాడు.

గదిలోకి వెళ్తూనే కోటు, చేతిలో కాగితాలు సోఫాలో పడేసి భార్యను దగ్గరకు లాక్కున్నాడు. రోజూలా చిరుకోపం ప్రదర్శించకుండా అతని చేతుల్లో ఒదిగిపోయింది.

కొద్దిక్షణాల తరువాత ఆమెను వదిలేసి, "ఊc! వెళ్ళి నాకు ఓ కప్పు వేడి వేడి టీ తెచ్చిపెట్టు" అన్నాడు సోఫాలో కూర్చుని కాలిబూట్లు విప్పుకుంటూ.

ఎర్రబడిన ముఖాన్ని పక్కకు తిప్పేసుకుంది, భర్త కొంటె చూపులకి తట్టుకోలేనట్టు.

భార్య తెచ్చి ఇచ్చిన టీ తీసుకుని, స్నానంచేసి, లాల్చీ పైజమా వేసుకుని తీరిగ్గా కూర్చున్నాడు.

రోజూలాగే క్లయింట్స్ కొంతమంది రావటంతో హాలులోకి వెళ్ళిపోయాడు. వాళ్ళందరితో మాట్లాడి, వాళ్ళని పంపించేసరికి సరిగ్గా టైము తొమ్మిదిన్నర అయింది.

భోజనాలు చేశాక భార్యని తొందరపెట్టాడు, సినిమాకు టైము అయిపోతూంది త్వరగా తయారవమంటూ.

ఆ రోజు ఆమెకు సినిమాకు వెళ్ళాలనిపించ లేదు. భర్త దగ్గర కూర్చుని హాయిగా కబుర్లు చెప్పాలనిపించింది. ఆ సంగతే అతని లాల్చీ బొత్తాములు సరిచేస్తూ గోముగా చెప్పింది. కృష్ణసుమంత్ కళ్ళు కొంటెగా మెరిశాయి.

"చిత్తం. రాణిగారి ఆజ్ఞ" అన్నాడు హాస్యంగా.

"ఊc! వేషం అంటా" మూతి సున్నాలా చుట్టింది.

నవ్వుతూ ఆమెను దగ్గరకు తీసుకుని, ఆమె పాపిట దగ్గర పెదవులు ఆన్చి చుంబించాడు.

ఇక అతన్ని క్షణం విడవలేనట్టు భర్తను అల్లుకుపోయింది.

* * *

రోజులు ఎవ్వరికోసం ఆగవు. ఒక్కొక్కటే దొర్లిపోతున్నాయి.

పదిహేను రోజులు గడిచిపోయాయి

కృష్ణసుమంత్ భార్యకు ఏ మాత్రం అనుమానం రాకుండా జాగ్రత్తపడుతూ అటు హాస్పటల్‌కి, ఇటు రోజా ఇంటికి కూడా వెళ్ళి వస్తున్నాడు. ఒక్కోసారి రోజా యింటికి వెళ్ళి ఆమెను తీసుకుని కారులో హాస్పటల్‌కి వెళ్తుంటాడు.

ఆరోజు ఆదివారం. కృష్ణసుమంత్ హరితకు చెప్పాడు, నేను పనిమీద కాకినాడ వెళ్ళి మళ్ళీ రాత్రి పదిగంటలకు తిరిగి వస్తానని. హరిత సరే అంది. కృష్ణసుమంత్ ఉదయం ఆరుగంటలకి బయలుదేరి వెళ్ళిపోయాడు.

* * *

కృష్ణసుమంత్ ఆ రోజు అంతా రోజా యింట్లోనే గడిపేశాడు.

ఆ రాత్రి పదకొండు గంటలు అవుతుండగా యింటికి వచ్చాడు. హరితకు భర్తని చూస్తూనే ఎలాటి అనుమానం రాలేదు. నిజంగా అతను కాకినాడ వెళ్ళి వచ్చాడనే అనుకుంటోంది.

ఒక్కోరోజు అయితే యింటికి వచ్చిన క్లయింట్స్‌ని అర్జంటు పనివుందని అని చెప్పి పంపేసి, హరితకు కూడా అలాగే చెప్పేసి రోజా యింటికి వెళ్ళసాగాడు.

అలా వెళ్ళిన రోజున రాత్రులు త్వరగా ఇల్లు చేరేవాడు కాదు. అక్కడ నుండి వచ్చిన రోజున భార్యతో సరదాగా కబుర్లు చెప్పాలనిపించేది కాదు. వస్తూనే మంచంమీద పడుకుండిపోయి, వెంటనే నిద్రపోయేవాడు.

"సర్లే! అస్తమానూ భర్తను ఏం సాధిస్తాను. వీధిలో తిరిగిన మగవాడికి లక్ష పనులు వుంటాయి. అందులోకి ఈయన మంచిపేరు వున్న లాయర్" అని మనసులో సరిపెట్టుకుంది.

కృష్ణసుమంత్ ఆ రోజు ఏదో పనివుంది అని చెప్పి కోర్టునుండి తిన్నగా యింటికి వచ్చి, స్నానం చేసి, బట్టలు మార్చుకుని, ఒక గంటలో వచ్చేస్తానని వెళ్ళాడు.

**జరిగిన కథ — 8 :** పి. యు. సి. పాసయిన మల్లిఖార్జునరావు చెల్లెలు హరితకు, తెచ్చిన ఏ సంబంధమూ నచ్చటంలేదు. తన పెద్ద మామయ్య శంకరంగారి కూతురు లీల పెళ్ళికి మద్రాస్ వెళ్తుండగా ఆమెకు ట్రైన్‌లో 'కృష్ణసుమంత్'తో పరిచయమేర్పడుతుంది. అతని అందాన్ని మనసులో మెచ్చుకొంటుంది. మళ్ళీ అతను లీల పెళ్ళిలో కనబడ్డప్పుడు ఆమె కలవరపడుతుంది. మామయ్య కొడుకయిన కుమార్ భార్య శైలజ కోరగా ఆమెతో బలభద్రరావుగారింటికి వెళ్తుంది హరిత. విజయమ్మా, బలభద్రరావుగార్ల ఏకైక పుత్రుడే ఈ కృష్ణసుమంత్ అని తెలుసుకుంటుంది హరిత. విశాఖపట్నంలో లాయర్‌గా పనిచేస్తున్న కృష్ణసుమంత్‌కి రామనాధం మేష్టారు ద్వారా పరిచయమైన తండ్రిలేని రోజాను, ఆమె తల్లి సీతమ్మను సంరక్షిస్తుంటాడు. తన ఫ్రెండ్ తమ్ముడికి ఉద్యోగం వేయింమని అడగటానికి వస్తాడు మల్లిఖార్జునరావు. అతనికే విషయమూ మరునాడు చెబుతానని చెప్పి, వచ్చేటప్పుడు హరితను కూడా తీసుకురమ్మని వాళ్ళని డిన్నర్‌కి ఆహ్వానిస్తాడు కృష్ణసుమంత్ మల్లిఖార్జునరావు చాకచక్యంగా హరితను డిన్నర్‌కు తీసుకువెళ్తాడు. కృష్ణసుమంత్ ఫ్రెండ్ శాస్త్రి ద్వారా అతని తల్లిదండ్రుల అడ్రస్ కనుకొని, వెళ్ళి హరిత పెండ్లి విషయం మాట్లాడివస్తాడు మల్లిఖార్జునరావు. కృష్ణసుమంత్ తల్లిదండ్రులు వచ్చి, హరితతో అతని పెళ్ళి నిశ్చయం చేసి వెళ్తారు. కృష్ణసుమంత్, హరితల వివాహం అతివైభవంగా జరిగిపోతుంది. కొన్ని కారణాలవల్ల కృష్ణసుమంత్, హరితల మధ్య ఘర్షణలు మొదలౌతాయి.




చట్టబద్ధమైన హెచ్చరిక
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

**1 రూపాయికి 10***
*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి
CASVS-238-234 TI

మెయిన్ డీలరు : బత్తిని రాఘవయ్య, ఒంగోలు.

హరిత ఆ విషయం అంత పట్టించుకోలేదు. అతను అన్నట్టుగానే ఆ రోజు గంటా గంటన్నరలో తిరిగి వచ్చేశాడు.

మర్నాడు పదిన్నర గంటలకు ఫోన్ రింగ్ అయితే వెళ్ళి రిసీవర్ అందుకుంది హరిత.

''హల్లో''

''హరితా! నేను. బావగారు ఇంటి దగ్గర వున్నారా ? కోర్టుకు వెళ్ళిపోయారా ?'' అంటూ ప్రశ్నించాడు మల్లికార్జునరావు.

''అన్నయ్యా! నువ్వా! మీ బావగారు కోర్టుకు వెళ్ళిపోయారు ఇప్పుడే! ఏం, ఏమైనా పని వుందా ?''

''ఆహా ! పని ఏంలేదు వూరికే ఫోన్ చేశాను.''

''ఊఁ! ఏమిటి సంగతులు ? వదినా, అమ్మా ఏం చేస్తున్నారు ? లోపల వున్నారా ? వదిన నిన్న అసలు ఫోన్ చెయ్యలేదు'' అన్నగారితో ఫిర్యాదు చేస్తున్నట్టుగా అంది.

చెల్లెలి మాటలకి అతను గట్టిగా నవ్వేస్తూ, ''మీ యింటికి ఎవరైనా చుట్టాలు వచ్చివుంటారని, హడావుడిగా తీరికలేకుండా వుంటావని ఫోన్ చెయ్యలేదేమో '' అది తన భార్య తప్పుకాదేమో అన్నట్టు చెప్పాడు.

''మా యింటికి చుట్టాలా ! ఎవరూ రాలేదే'' అర్థంకాలేదు ఆమెకు.

''రాలేదా !'' ఆశ్చర్యంగా అడిగాడు.

''ఏమిటి అన్నయ్యా నువ్వు మాట్లాడేది ! మీ బావగారు నీకు ఎక్కడైనా కనిపించి జోక్ చేశారా ! ఏం !'' అడిగింది నవ్వుతూ.

''నిన్న సాయంత్రం నేను చూశాను బావగారు, ఓ అమ్మాయి కలిసి కారులో వెళ్ళిపోవటం. మీ యింటికి చుట్టాలు ఎవరైనా వచ్చేరేమో అనుకున్నాను'' తెల్లబోయినట్టుగా,అయోమయంగా అన్నాడు.

ఆ మాటలు వింటున్న హరిత గుండె ఒకసారి పగిలిపోయినట్టు అయి మళ్ళీ కొంతసేపటికి మామూలుగా అయింది.

''ఏమిటి ! నువ్వు చూశావా ! ఎవరయినా క్లయింట్ ఏమో !''

బెదిరిపోకుండా మనసుని, ఆశలని గుప్పెట్లో దాచుకుంటూ, ప్రాణం బిగబట్టుకుంటూ ప్రశ్నించింది.



''ఎవరో ఏమో నాకు తెలీదు. నేను ఫ్రెండ్ దగ్గరకు కారులో వెళ్తున్నాను. వాళ్ళ కారు అలా వెళ్ళిపోయింది.''

''ఆ అమ్మాయి ఎలా వుంది! వయసు ఏమాత్రం వుంటుంది !''

''ఏమో! నేను సరిగ్గా చూడలేదుగాని తెల్లగా వున్నట్టు కనిపించింది. వయసు ఇంచుమించు నీ వయసే వుంటుంది.''

''వాళ్ళు నిన్ను చూశారా!'' దడదడలాడే గుండెలతో ప్రశ్నించింది.

''బాగుంది నీ ప్రశ్న. నన్ను చూస్తే కారు ఆపి నాతో మాట్లాడరా !'' నవ్వాడు.

''ఆ అమ్మాయి ఎవరో నాకు అర్థం కావటంలేదు. ఎప్పుడూ యింటికి వచ్చిన గుర్తు కూడా లేదు'' అంది అనుమానంగా

మల్లికార్జునరావు చెల్లెలి అనుమానానికి నవ్వేశాడు.

''ఎవరో తెలిసిన అమ్మాయి అయివుంటుంది. కారులో లిఫ్ట్ అడిగితే బావగారు కాదనలేకపోయారేమో ! పోనీ నీకు అంత అనుమానం అయితే బావగారు వచ్చేక ఆయన్నే అడుగు.''

హరిత మాట్లాడలేదు. ఆమె మెదడులో అనుమానం పురుగులా మారి తొలిచేయసాగింది మెదడులో అనుమానం పురుగులా తొలిచేస్తుంటే, గుండెల్లో బాధ మెలితిరుగుతూ ఆమెను నిలబడ య్యటంలేదు.

మల్లికార్జునరావు ఫోన్ పెట్టేశాడు. హరిత అలా అక్కడే సోఫాలో కూలబడిపోయింది.

మనసు ఆమెను పదేపదే ప్రశ్నిస్తుంది, ''ఇది నిజమా !'' అంటూ.

ఆమెకు నమ్మబుద్ధి కావటంలేదు. మగవాడి మనసు చంచలమైనది, నిజం ఏమో !

మనసు రకరకాలుగా ఆలోచిస్తుంది. స్త్రీ మనసు అయితే ఒక్క భర్త ప్రేమకే కట్టుబడి పోతుంది. అతను తప్ప ఆమెకు ఈ ప్రపంచంలో ఎవరూ కనిపించరు. పురుషుడి మనసు అలాకాదు. అతనికి రకరకాల మనుష్యులతో పరిచయం అవుతుంది. ఆ పరిచయం ఏ పరిణామానికి దారి తీస్తుందో ఎవరూ గ్రహించలేరు.

హరిత మనసు పరిపరివిధాల పోతూంది !

## 27

కృష్ణసుమంత్ కోర్టునుండి వచ్చి స్నానంచేసి బట్టలు మార్చుకుని, తీరిగ్గా కూర్చుని టీ తీసు కుంటున్నాడు

భర్తవైపు పరీక్షగా చూస్తూ అతని అంతరాంతరాల్లో గుట్టుగా దాగున్న నిజాన్ని బైటకు లాగాలని విశ్వప్రయత్నం చెయ్యసాగింది. అతను అదేమి గ్రహించనట్టు ఎప్పటిలాగే సరదాగా ఉషారుగా ఉన్నాడు.

'హు ! మనిషిలో ఎంత నటన' అనుకుంది.

మళ్ళీ అంతలోకే ఆమె మనసు ఎదురు తిరిగింది. 'అనవసరంగా ఈయనమీద నింద వేస్తున్నానేమో ! ఆయన కళ్ళల్లో తనపై అనురాగం నిండుగా తొణికిసలాడుతూంది' అనుకుంది



ఏమైనా మనసులో సంగతి దాచుకోకుండా అడిగేస్తే హృదయ భారం తగ్గిపోతుంది.

"మీరు నిన్న సాయంత్రం ఎక్కడికి వెళ్ళారు?" మామూలుగా, శాంతంగా ప్రశ్నించింది, మనసులో అనుమానాన్ని పైకి ఏ మాత్రం తెలియనివ్వకుండా జాగ్రత్తపడుతూ.

"నేనా! ఎక్కడికి వెళ్ళాను?" అంటూ కుడిచేతి చూపుడు వేలు నుదుటికి ఆనించుకుని భ్రుకుటి ముడిచి గుర్తు తెచ్చుకొనడానికి ప్రయత్నిస్తున్నట్టుగా క్షణం ఆలోచించి, 'ఆఁ! గుర్తు వచ్చింది' అన్నట్టు నుదుటిమీద వేలు తీసేసి చిరునవ్వు నవ్వాడు. ముడిపడిన అతని కనుబొమ్మలు యథాప్రకారం అయ్యాయి.

"ఓ ఫ్రెండ్‌ని కలుసుకోవడానికి వెళ్ళాను."

"ఫ్రెండ్ అంటే ఆడా? మొగా?" ఆమె గొంతుకలో రవ్వంత హేళన తొంగిచూసింది.

కృష్ణహనుమంత్ ఆ హేళన గుర్తించినా గుర్తించనట్టే గట్టిగా నవ్వేస్తూ అన్నాడు—

"మగవాళ్ళకి మగవాళ్ళు ఫ్రెండ్స్ కాక ఆడవాళ్ళు కూడా వుంటారా? అయితే నువ్వు ఒకసారి ఫ్రెండ్ ఇంటికి వెళ్ళొస్తాను అని వెళ్ళావు. ఆ ఫ్రెండ్ ఆడా? మొగా? అని నేను అడిగానా!" ఈసారి అతని కంఠంలో రవ్వంత హేళన తొంగి చూపింది.

"నా యీ ప్రశ్నకు నువ్వు ఏం సమాధానం చెపుతావో చెప్పు, చూద్దాం!"

"ఎదుటి వాళ్ళని తికమకపెట్టి ప్రశ్నలవర్షం కురిపించటంలో కాదు గొప్పతనం. ఎదుటివాళ్ళు అడిగే ప్రశ్నలకి టకీమని సమాధానం చెప్పగలగటంలో వుంది గొప్పతనం" అన్నట్టు వున్నాయి అతని చూపులు.

భర్త ఇచ్చిన సమాధానానికి, ఆ మాటల్లో హేళనకి, చూపుల్లో భావాలకి హరిత ముఖం రోషంతో ఎర్రబడింది.

"నేనేం తప్పు చెయ్యలేదు. తప్పు చెయ్యనప్పుడు నేను ఎందుకు జడవాలి!"

"తప్పుచేసిన వాళ్ళు ఆ నిజాన్ని కప్పిపుచ్చటం కోసం ఎన్నైనా అవస్థలు పడాలి."

"నాకేం అంతకర్మ" అన్నట్టు ధీమాగా, దర్జాగా, తల ఎగరేసింది.

"మరి అందరూ నీలాగకాదా! నీకున్న పౌర్షం, రోషం అందరికీ వుండవా!" అన్న భావాన్ని చూపులతో వ్యక్తపరిచాడు.

"అంటే నేను ఫ్రెండ్ యింటికి వెళ్ళింది అమ్మాయింటికి కాదనా మీ వుద్దేశం!" మనసులో కోపాన్ని బలవంతంగా నొక్కిపట్టి అడిగింది.

"ఏమో! ఎవరింటికి వెళ్ళావో నేను చూశానా! నువ్వు చెప్పావు, నేను నమ్మేను. అంతే!" మామూలుగా, శాంతంగా అన్నాడు.

హరిత భర్త మాటలకి దెబ్బతిన్నట్టు చూసింది. అపుకోలేని కోపంతో ఊగిపోతూ అంది—

"అయితే నిన్న కారులో మీరు వూరు అంతా తిప్పింది మగఫ్రెండ్‌నా!"

"వ రి! కాదని బుకాయించడానికి నువ్వు చూశావా!"

"ఓహో! ఎవరూ చూడలేదని ధైర్యమా!" హేళనగా చూసింది.

"అయితే నువ్వు చూశావా!"

"నేనే చూడనవసరంలేదు. ఈ లోకం అంతా కళ్ళు మూసుకుంది అనా మీ వుద్దేశం! మీరు ఓ అమ్మాయిని కార్లో కూర్చోబెట్టి తీసుకువెళ్ళటం మా అన్నయ్యే స్వయంగా చూశాడు."

"అయితే మీ అన్నయ్యకు చత్వారం వచ్చింది అన్నమాటే! సందేహం లేదు. వెంటనే కళ్ళద్దాలు కొని పెట్టుకోమను" తాపీగా చెప్పిన ఆ మాటల్లో హేళన ధ్వనించింది.

తన అన్నగార్ని అంత మాట అనటంతో కోపంతో మండిపడిపోయింది.

"చత్వారం వచ్చింది మా అన్నయ్యకు కాదు మీకు. అబ్బాయి అనుకుని అమ్మాయిని వెంటేసుకు తిరిగారేమో! మీరే ఆ కళ్ళ అద్దాలు మార్పించుకోండి" మనసులో అక్కసు అంతా కక్కేసింది.

భార్యకు మళ్ళీ ఏదో సమాధానం ఇవ్వబోతుంటే, అంతలో నౌకరు వచ్చి 'బాబూ!' అంటూ పిలిచాడు ఆ పిలుపు వినగానే అతను గది ఇవతలకు వచ్చాడు.

"మీకోసం ఎవరో వచ్చారు బాబూ!" అని చెప్పాడు ఆ నౌకరు.

"వస్తాను. కూర్చోమని చెప్పు." అంటూ చెప్పి అతడ్ని పంపేసి, అతను తరువాత వెళ్ళాడు

అంతటితో ఆ రోజుకి ఆ వాదన ఆగిపోయింది. లేకపోతే చినికి చినికి గాలివాన అయి పెనుతుఫాన్‌గా మారిపోయే ప్రమాదం జరిగేది. ఆ వచ్చినవాళ్ళు ఆ తుఫాన్‌ని ఆపేశారు రాకుండా.

ఆరోజు మొదలు మూడు రోజులు వరకూ భార్యాభర్తలు ఇద్దరూ ఎడముఖం పెడముఖంగానే వున్నారు. హరిత మనసులోనే ఉడికిపోతూంది.

"ఏం! తను మాట్లాడకపోతే ఆయన మాట్లాడకూడదా!"

"ఈయనది నిజంగా దొంగ ముఖమే! ఆ కళ్ళద్దాల్లోంచి కళ్ళుపెట్టుకుని దొంగచూపులు చూస్తారు." ఆ క్షణంలో, మనసులో కసిగా అనుకుంది.

రాను రాను ఆమెలో రోషావేశాలు కరిగి నీరై కన్నీళ్ళుగా మారిపోసాగాయి. తనలో తాను ఒంటరిగా కూర్చుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆ రోజు అతను కోర్టునుండి వచ్చేసరికి హరిత గదిలో మంచంమీద పడుకుంది. బూట్లచప్పుడైనా, భర్త వచ్చినట్టు గ్రహించినా లేవలేదు.

హరిత తల దువ్వుకోలేదు, ముస్తాబు అవలేదు. నీరసంగా అలాగే మంచంమీద పడివుంది. భార్యని అలా చూసేసరికి నిజంగా అతనికి జాలేసింది. బట్టలు మార్చుకుని వెళ్ళి స్నానంచేసి వచ్చాడు. కృష్ణహనుమంత్ వట్టిషరాయితోవున్నాడు. పైన లాల్చీగాని, కమీజుగాని వేసుకోలేదు. మనిషి తెల్లగా, బలంగా, ఎత్తుగా, హుందాగా వున్నాడు.

హరిత అతన్ని చూడనట్టు ముఖం పక్కకి తిప్పేసుకుంది. భార్యని అలా చూసేసరికి ఇంకా పంతం పట్టుకుని వేలాడాలనిపించలేదు. మెల్లగా మంచం సమీపించి ఆమెపై చెయ్యి వేశాడు. తృళ్ళిపడినట్టు కళ్ళు తెరిచింది. మంచంమీద తనపక్కని కూర్చుంటున్న అతను కనిపించాడు చిరునవ్వుతో!

హరితకు ఒళ్ళు మండింది. ఒక్కసారిగా భర్త చేతిని విసురుగా నెట్టేసింది కోపంగా!

అతను ఆమె కోపాన్ని పట్టించుకోలేదు పడుకున్న ఆమె భుజాలుపట్టి బలవంతంగా లేవదీసి, హృదయానికి హత్తుకున్నాడు. ఆమె గింజుకుంటున్నా లెక్కచెయ్యక ఒళ్ళోకి లాక్కుని, చెంపలు నిమిరి, ఆమె ముంగురులు సవరించి—

"నా మీద ఇంకా కోపం పోలేదా?" అడిగాడు నవ్వుతూ.

అతని ముఖంలోకి ఒక్కసారి చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంది, పసిపాపలా అతని చేతుల్లో ఒదిగిపోతూ!

* * *

ఆ రోజు నుండీ ఇద్దరూ మునుపటిలా నవ్వుతూ సరదాగానే వుంటున్నారు.

ఒకసారి మల్లిఖార్జునరావు భార్యని, తల్లిని తీసుకుని వచ్చాడు. ఆ రోజు వాళ్ళని భోజనం చేస్తేగాని వెళ్ళనివ్వలేదు కృష్ణహనుమంత్. ఆ రోజు అంతా నవ్వులతో, హాస్యాలతో గడిచిపోయింది.

రెండురోజుల తరువాత భార్యాభర్తలు ఇద్దరూ మల్లిఖార్జునరావు యింటికి వెళ్ళివచ్చారు.

హరిత మనసులో గట్టిగా నిశ్చయించేసుకుంది— 'భర్తమీద ఇక ఎలాటి అనుమానాలు పెట్టుకోకూడదు' అని. 'నిజంగా భర్తనే అనుమానించటం అంత తెలివి తక్కువ విషయం మరొకటిలేదు' అనుకుంది

"పాపం! ఆయనకి ఎన్నోపనులు వుంటాయి ఎందరితో మాట్లాడవలసి వస్తుంది. ప్రతి

విషయంలో ఆయనతో పోట్లాడటం ఏం బాగుంటుంది.''

పెళ్ళిఅయి మూడునెలలు పూర్తికావస్తూంది. హరిత తన అనుమానానికి తనే సిగ్గు పడింది.

రోజు రోజుకి భర్త అనురాగంలో మునిగి పోతూ ఆనంద పరవశురాలవుతూంది ఆమె.

## 28

శాస్త్రి హడావుడిగా వచ్చి హరితతో చెప్పాడు— కృష్ణసుమంత్‌గారు ఈరోజు యింటికి రాను అని చెప్పమన్నారు. తన ఫ్రెండ్ వాళ్ళతల్లిచనిపోయింది. ఈరోజు అంతా అందరం అక్కడే వుంటాం అని చెప్పాడు, వచ్చినంత హడావుడిగా వెళ్ళిపోతూ. హరిత మౌనంగా విని వూరుకుంది.

''వూళ్ళో ఎక్కడ, ఏ మూల, ఏం జరిగినా ఈయనకే కావాలి'' అని విసుక్కుంది రాత్రి పడుకోబోయేముందు.

*　　*　　*

రోజా తల్లి శవందగ్గర కూర్చొని గుండెలు పగిలేలా ఏడుస్తూంది.

''అమ్మా ! నన్ను ఒక్కద్దాన్నే వదిలేసి వెళ్ళి పోయావా ! నన్ను దిక్కులేని దాన్ని చేసేశావా !'' అంటూ హృదయ విదాకరంగా ఏడుస్తున్న ఆ ఏడుపు వింటూనే అక్కడ వున్నవారి అందరి హృదయాలు జాలితో ద్రవించిపోయి కన్నీరు కార్చారు.

కృష్ణసుమంత్ రోజా తల నిమిరి ఆమెను ఓదార్చసాగాడు. అతన్ని పట్టుకుని ''ఏవండీ ! అమ్మ వెళ్ళిపోయింది. నన్ను ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయింది'' అంటూ భోరున ఏడ్చింది.

''రోజా ! రోజా !'' అంటున్న అతని కంఠం బొంగురుపోయి బరువుగా ధ్వనించింది.

అతనికీ, ఆమెకూ ఎలాటి సంబంధం వుందో వూహించుకోలేక వారిరువుర్నీ చూస్తూ నిలబడ్డారు అంతా !

అందరికీ రోజాని ఓదార్చటం కష్టమే అయి పోయింది.

ఆమెను అక్కడ వున్నవాళ్ళకి అప్పగించి అతను అవతలకు వెళ్ళాడు.

సీతమ్మ ఒక ఇరవై రోజులుగా, హాస్పటల్లో వుంది. ఆవిడకు బ్లెడ్ కాన్సర్ బాగా ముదిరి పోయింది. ఒక మూడురోజుల నుండి ఆవిడకు ఒంటిమీద స్పృహలేదు. ఇక బ్రతకటం కష్టం అని, కొన్ని గంటల్లో ప్రాణం పోతుంది అని డాక్టర్లు నిర్ధారణ చేసుకున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంటకు ప్రాణంపోతే శాస్త్రి ఇంటికి తీసుకొచ్చి, కృష్ణసుమంత్‌కి కోర్టుకి కబురు చేయిస్తే, అతను కోర్టునుండి తిన్నగా ఇటు వచ్చేసి యింటికి కబురు చేయించి, ఫ్రెండ్స్ ముఖ్యం అయిన వాళ్ళకి కబురు చేయించి అక్కడ జరగవలసిన పనులు అన్నీ చకచక చేయించేశాడు.

శవాన్ని ఎత్తేస్తుంటే రోజాని ఎవరూ పట్టుకో లేకపోయారు. తల కొట్టుకుని ఏడుస్తున్న ఆమెను కొంతమంది పక్కకు బలవంతంగా లాక్కు వెళ్ళిపోయారు.

కృష్ణసుమంత్ ఆవిడకు తలకొరివి పెట్టి





ఇంటికి తిరిగి వచ్చాడు. అతను వచ్చేటప్పటికి ఇల్లు అంతా ఎలాగో వుంది. వచ్చిన వాళ్ళు అంతా వెళ్ళి పోయినట్టు ఇల్లు అంతా ఖాళీగావుంది. రోజా దగ్గర మాత్రం ఒక ముసిలావిడ, పక్కింటి ఆవిడా కూర్చుని వున్నారు. అతను వచ్చాక వాళ్ళు వెళ్ళిపోయారు.

రోజా అతన్ని చుట్టేసి భోరున ఏడ్చింది. మౌనంగా ఆమెను ఓదార్చాడు. మర్నాడు అక్కడ శాస్త్రిని ఉండమని తను యింటికి వచ్చేడు.

హరిత భర్తని మామూలుగా ప్రశ్నించింది, 'ఎవరు పోయారు' అంటూ.

'నా ఫ్రెండ్ వాళ్ళ తల్లి' అని చెప్పేడు.

ఆ తరువాత ఆమె ఇంకేమి ప్రశ్నించలేదు.

ఆ రోజు భార్యకు చెప్పాడు, 'ఈ పదిరోజులు వరసగా నేను వాళ్ళ యింటికి వెళ్ళాలి' అని.

ఆమె అతనికి అడ్డేమి చెప్పలేదు.

---

## ఇది ఏమి కోరిక

ఇది ఏమి కోరిక ?<br>
　　ఎండ మావుల పిండుకోవాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　పడమట భానుడు ఉదయించాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　అందని చుక్కలను కోయాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　ఆకాశపు టంచులు చేరాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　అమావాస్యరోజు చంద్రుని చూడాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　ఆనాటి రామరాజ్యం ఈనాడు చూడాలని<br>
ఇది ఏమి కోరిక ?<br>
　　ఈనాటి నాయకుడు ఆనాటి రాముడు<br>
　　　　　　కావాలని

— పి. సుభద్ర

---

కృష్ణసుమంత్ రోజా వెళ్ళివస్తున్నాడు.

పదకొండు రోజులు పూర్తి అయిపోయాయి.

రోజా దగ్గర పనిమనిషి ఎప్పుడూ అలాగే వుంటుంది. శాస్త్రి వెళ్ళి చూస్తుంటాడు. కృష్ణసుమంత్ ప్రతిరోజు ఎనిమిది దాటాక, తనకోసం వచ్చినవాళ్ళందరూ వెళ్ళిపోయాక రోజా యింటికి వెళ్ళి మళ్ళీ పది గంటలకి యింటికి వచ్చేస్తుంటాడు.

అతను యింట్లో అడుగుపెట్టగానే రోజా గదిలో పక్క వేసుకుని పడుకున్న పనిమనిషి లేచి అవతలకి వెళ్ళిపోతుంది. అతను వెళ్ళిపోయేవరకూ గదివైపు రాదు.

ఎందుచేతనైనా రాలేకపోతే అతని మనసు ఎలాగో వుంటుంది. ఆమెను చూసేదాకా మనసు నిలబడదు. రోజా అతనికి ప్రాణంతో సమానం అయిపోయింది.

రోజాకూ అంతే ! తల్లిపోయిన దగ్గరనుండి అతను అంటే ఇంకా ఎక్కువ ఇష్టం కాసాగింది. అతను రాకపోతే ఆమెకు మనసు అంతా దిగులుగా ఎలాగో వుంటుంది. అతను రాగానే కొండంత ధైర్యం కలిగి కళ్ళల్లో కొత్తఆశలు తళుక్కు మంటాయి రోజు రోజుకి వాళ్ళిద్దరి మధ్య అనుబంధం ఇంకా గట్టిగా ముడిపడసాగింది.

రోజా తల్లిపోయి నెల పూర్తి అయింది. ఆమె మెల్లమెల్లగా ఇప్పుడిప్పుడే దుఃఖాన్ని మరిచి పోగలుగుతూంది. కృష్ణసుమంత్ ఒక్కోరోజు ఆమెను అలా ఎక్కడికి అయినా షికారుకి తీసుకేళ్ళే వాడు.

అలా రోజులు మెల్లమెల్లగా గడిచిపోతున్నాయి.

*　　*　　*

హరితకు భర్తమీద ఎలాంటి అనుమానం లేదు. అతను ఆలస్యంగా ఇంటికి వచ్చినా కారణం అడగటం లేదు.

ఆ రోజు మల్లిఖార్జునరావు యింటికి వచ్చి చెప్పాడు — ''బుధవారం అందరం కలిసి తిరుపతి వెళ్తున్నాం. ఇరవై రోజులు శెలవు పెట్టాను. కంచి, కాళహస్తి, తిరుపతి, మెడ్రాస్ అన్ని వూళ్ళూ వెళ్ళొస్తాం'' అంటూ.

హరిత భర్తవైపు చూస్తూ అంది, ''వాళ్ళతో కలిసి మనము వెళ్దామా ?'' అని.

కృష్ణసుమంత్ భార్య మాటలు వింటూనే నవ్వాడు, ''నాకు ఎక్కడ తీరుబడి'' అంటూ.

హరిత అన్నగారి ఎదురుగా ఇంకేమీ అనలేదు. మల్లిఖార్జునరావు కూడా రమ్మనే అన్నాడు. అతనికీ అలాగే చెప్పాడు.

అతను వెళ్ళిపోయాడు, ''రేపు అమ్మా, మీ వదినా వస్తారు'' అంటూ చెప్పి.

హరిత ఆ రాత్రి భర్తను ఒకటే సాధించింది.

''మన పెళ్ళి అయిన తరువాత మనం ఎక్కడికీ వెళ్ళలేదు. వాళ్ళతో మనం కూడా వెళ్దామండీ'' అంది.

''మీ అన్నయ్యకి అంటే ఆఫీసు. నాకు కోర్టు పనులు, తీరిక వుండొద్దూ !''

''మీకు ఎప్పుడూ తీరిక వుండదా ! అసలు మీకు అలాటి సరదాలు అంటూ వుంటేగా'' మూతిముడుచుకుంది.

''అదిగో ! అప్పుడే కోపం వచ్చేసింది. అమ్మాయిగారికి ముక్కున వుంటుంది కోపం'' అంటూ ఆమె ముక్కుమీద చూపుడువేలితో సున్నితంగా కొట్టాడు.

భర్త చేతిని కోపంతో విసిరికొట్టింది.

''నీకు అంత చూడాలని సరదాగా వుంటే వాళ్ళతో వెళ్ళిరా ! కాదనను ''

''నేను ఏం వెళ్ళను'' అంది మొండిగా.

''అదిగో, అదే వద్దు అన్నాను. మరీ అంత మొండిపట్టు తగ్గించాలి. నాకు రావడానికి ఎలా కుదురుతుంది ! చెప్పు ! నువ్వు ఆలోచించు ! నీకు వెళ్ళాలనివుంటే చెప్పు. నిన్ను వాళ్ళతో పంపిస్తాను. నాలుగు రోజులు సరదాగా తిరిగి వద్దువుగాని'' అన్నాడు ఆమెను గుండెలకు చేర్చు కుంటూ.

హరిత మాట్లాడలేదు. భర్త చెప్పిన మాటల్లో నిజం వుంది, అనిపించింది. అతనికి

[46వ పేజీ చూడండి]

ఎందు కంత
నాకోసం శ్రమ తీసికొని
యిప్పుడు ఫిల్టర్ కాఫీ
తయారుచేశావు?

అదేంకాదు...
ఇది రికొరీ
ఇన్‌స్టెంట్

# రికరి®
# ఇన్‌స్టెంట్




*ఇది ఫిల్టర్*
*కాఫీ వలెనే యెంతో*
*రుచిగా ఉంటుంది కాబట్టి*
*తేడాచెప్పడం చాలాకష్టం.*

నెస్ కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్టత తెలిసినవారు

SAA/FSL/R/1135



'కోరుకున్న మొగుడు'లో శోభన్‌బాబు, జయసుధ, లక్ష్మి

'తల్లీ కొడుకుల అనుబంధం'లో కె. ఆర్. విజయ, జయప్రద



# సినిమా వి

## పుణ్యభూమి కళ్ళు తెరిచిందిలో కమలారాణి కంట తడి

రావు బహద్దూర్ రంగారావు సాయం సమయ విలాస విహారానికి బయలుదేరబోతున్నాడు. ఆయన ఉత్సాహం చూసి ఎలాగైనా మాట్లాడాలని చాలా సేపట్నుంచి ధైర్యం కూడగట్టుకోడానికి ప్రయత్నిస్తోంది జమీందారిణి కమలారాణి. చివరికి బీరువా లోంచి కైపు తీసిస్తూ అంది : "లంకంత కొంపలో బిక్కు బిక్కుమంటూ ఒక్కదాన్నే ఉండాలి. ఈ జాగారాలు నేను చెయ్యలేను. ఈరోజు నుంచైనా త్వరగా ఇల్లు చేరుకోండి."

రంగారావు ఏం మాట్లాడలేదు. కైపు అందుకుని ముడి వేసుకున్నాడు. కమలారాణికి ఉక్రోషం ముంచుకొచ్చింది. కాని, ఆడది. ఏం చేయగలదు ? స్వగతంగా అనుకోసాగింది : "నా పిచ్చి గాని, నా కోసం మీ రాచకార్యాలు ఆపండి... అమ్మాయిగార్ని పట్నం మాన్పించండి. ఇద్దరం తోడుగా ఇక్కడే పడి ఏడుస్తాం." గొంతులో ఏడుపు జీరగా వినిపిస్తోంది.

రంగారావు గిరుక్కున వెనుతిరిగాడు : "నో ! అమ్మాయిగారు చదివితీరాలి."

"ఎందుకు చదవాలి ? మీ వంశంలోగాని, మా వంశంలోగాని పెద్దమనిషి అయిన ఆడపిల్ల చదువులనీ చట్టుబండలనీ గడపదాటి బయట అడుగు పెట్టిందా ?"

"స్టాప్ దట్ నాన్సెన్స్ ! యూ సినికల్ సిల్లీ వుమన్ ! బ్రిటిషువారు మన ప్రభువులు. వారి అడుగుజాడల్లో నడిస్తే మనం వారికి దగ్గర అవుతాం. ఇప్పుడు మన బాగు, దేశం బాగు వారి దయమీద ఆధారపడి ఉన్నాయి. అండర్‌స్టాండ్ ? మరోసారి నా కళ్ళముందు తడి పెట్టకండి !" గర్జిస్తూ తీవిగా బయటకు నడిచాడు రంగారావు.

రాణీవాసం కన్నీరులో — సాయం సంధ్యల నీడల్లో చీకటి పులుముకోసాగింది.

దేవదాసు కనకాల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చిక్కాల సత్యనారాయణమూర్తి, బడుగు విష్ణుమూర్తి నిర్మించే అరుణోదయ పిలిమ్స్ ఇంటర్నేషనల్ వారి "పుణ్యభూమి కళ్ళు తెరిచింది"లో శ్రీధర్, జీవా, సంగీత, సతీష్, దేవదాసు, మధు, రాళ్ళపల్లి, వంకాయల, జయదేవ్, శివకుమార్, శ్రీలక్ష్మి, విజయగౌరి పాత్రధారులు. శ్రీశ్రీ, నెల్లూట్ల మాటలు, పాటలు రాశారు. బి. గోపాలం సంగీతం, భాస్కరరావు ఛాయ, రవీంద్రబాబు కూర్పు నిర్వహిస్తున్నారు. నిర్మాణత : సోమరాజు అల్లూరి.

## శేషాలు -జి. వి. జి.

### రంగూన్ రాజా

"కడల్ మీన్‌గళ్" అనే విజయవంతమైన తమిళ చిత్రాన్ని వై. చిట్టిబాబు నిర్మాణతలో అలయమ్మన్ క్రియేషన్స్‌వారు పై పేరున తెలుగులో అనువదిస్తున్నారు. కమలహాసన్ (ద్విపాత్రలు), సుజాత, స్వప్న, అంబిక, సుకుమారి, వాగేష్ పాత్రధారులు. వీటూరి మాటలు, పాటలు రాశారు. గోవర్ధన్ సంగీతం, రామలింగం కూర్పుతో కె. నరసింహారావు సమర్పించే ఈ చిత్రానికి వై. వెంకటేశ్వరరావు నిర్మాత.

### ప్రేమ సంకెళ్ళు

శ్రీ విజయకృష్ణ మూవీస్ "ప్రేమ సంకెళ్ళు" చిత్రం షూటింగ్ సింగపూర్‌లో డిసెంబర్‌లో ప్రారంభమవుతుందని డైరెక్టర్ విజయనిర్మల తెలియజేశారు. ఆమె పుత్రుడు చిః నరేష్ సరసన నాయికగా నూతన నటి పరిచయం గావింపబడుతుంది.

## తొలి చిత్ర నిర్మాతతో తొలి ఇంటర్‌వ్యూ!

మన దేశంలో మొట్టమొదటిసారిగా నిర్మించబడ్డ నిశ్శబ్ద చిత్రం "హరిశ్చంద్ర". దీనిని 1913 లో దాదాసాహెబ్ ఫాల్కే డూండీ నిర్మించారు. ఆ చిత్రం విడుదలైన వెంటనే "కేసరి" అనే మరాఠీ దినపత్రిక ఆయనతో ఇంటర్‌వ్యూ జరిపింది. అందులోంచి కొన్ని భాగాలు —

ప్ర : భారతదేశంలో సినిమాలకు ఎలాంటి భవిష్యత్తు ఉంటుంది ?

జ : మొదట్లో కొంత కాలం 'కళ'గా భావించబడినా, రాను రాను ఇదో వినోద సాధనంగా కేవలం వ్యాపారం అవుతుంది.

ప్ర : మీ ఉద్దేశంలో సినిమా ప్రభావంతో ప్రజలు చెడిపోవచ్చా ?

జ : భారతదేశానికి విలక్షణమైన కొన్ని సంప్రదాయాలు, మర్యాదలు, ఆచారాలు ఉన్నాయి. పాశ్చాత్య ఆచార సంప్రదాయాలు ఇతర దేశాలకు పాకడం నాకు తెలుసు. పిల్లలూ, యువకులూ దురభిప్రాయం ఏర్పరచుకోకూడనటువంటి చిత్రాలు నిర్మించాలి. మన దేశంలో చిత్ర నిర్మాణం మీద కొన్ని ఆంక్షలుండాలి.

ప్ర : ప్రభుత్వం పరిశ్రమకు తోడ్పడాలంటారా ?

జ : అవును. అది వారి విధి అనుకుంటాను. పరిశ్రమ యొక్క ఆంతరంగిక వ్యవహారాల గురించి కొంత తెలిసిన వారితో బోర్డు ఏర్పాటు కావాలి. కొన్ని రక్షణలు కల్పించాలి. కొన్ని సుంకాలు ఎత్తివేయవచ్చు.

ప్ర : ఇలాగే చిత్రాలు నిర్మిస్తూపోతే ప్రజాదరణ దక్కుతుందంటారా ?

జ : కాలక్రమాన ప్రజాదరణ తగ్గుతుంది.

'బొబ్బిలి పులి' లో శ్రీదేవి, రామారావు



## సినిమా

### శంకరాభరణంకు స్వర్ణ ధ్వనిముద్రికలు

విఖ్యాత గాయని ఎం. ఎస్. సుబ్బులక్ష్మి తన కుమార్తె రాధతో కలిసి "జో అచ్యుతానంద జోజో ముకుందా" అన్నమాచార్య కీర్తనను మధురంగా గానం చేసిన అనంతరం "ఆమె తంబురలో నేనూ ఒక తంత్రిని ఎందుకు కాకూడదూ — అనిపిస్తోంది నాకు. నాకు సంగీత శాస్త్రం తెలియకపోయినా సంగీతమంటే పంచ ప్రాణాలూ," అన్నారు డైరెక్టర్ కె. విశ్వనాథ్. అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన "శంకరాభరణం" చిత్రం రికార్డుల విక్రయం లక్ష యూనిట్స్‌ను అధిగమించిన సందర్భంగా ఎస్. ఇ. ఎ. రికార్డ్స్‌వారు గోల్డ్ డిస్క్ ప్రదానోత్సవాన్ని ఇటీవల భారీ ఎత్తున జరిపారు. ప్రముఖ రచయిత, సెంట్రల్ ఎక్సైజ్ కలెక్టర్ ఇచ్ఛాపురపు జగన్నాధరావు అధ్యక్షత వహించిన సభకు వ్యాఖ్యాతగా కొంగర జగ్గయ్య వ్యవహరించారు. ఎం. ఎస్. సుబ్బులక్ష్మి ద్వారా స్వర్ణ ధ్వనిముద్రికలు చిత్ర దర్శకుడు, సంగీత దర్శకుడు, గేయ రచయిత, గాయనీ గాయకులు, నిర్మాతకు అందజేయబడ్డాయి. డాక్టర్ చిత్తూరి సత్యనారాయణ, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, ఏడిద నాగేశ్వరరావు ప్రభృతులు కూడా ఉపన్యసించారు.

### ఆర్. పి. ఫిలిమ్స్

"చంద్రమోహన్, చిరంజీవి, కవిత, నాగభూషణం, మిక్కిలినేని, త్యాగరాజు ముఖ్య పాత్రధారులు. ఇంకో హీరోయిన్‌ను త్వరలోనే నిర్ణయిస్తాం," అన్నారు ఆర్. పద్మనాభం. ఈయన నిర్మించే ఆర్. పి. ఫిలిమ్స్ తొలి చిత్రానికి రమేష్‌నాయుడు సంగీతం, కొండపనేని రామలింగేశ్వర రావు శిల్పం, ఆదుర్తి హరనాథ్ కూర్పు, జి. సత్యం—శేషు సహకార దర్శకత్వం నిర్వహిస్తారు. "డిసెంబర్ చివరలో సాంగ్స్ రికార్డ్ చేస్తాం. జనవరి నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే విజయనిర్మల.



'డబ్బు! డబ్బు! డబ్బు!'లో రాజసులోచన

### చంద్ర పిపి ఆర్ట్స్ తొలి చిత్రం

"మా చిత్రంలో కృష్ణగారు త్రిపాత్రధారి," అన్నారు ఎస్. వి. సుబ్బరాజు. ఈయన కథ, సమర్పణలో కలిదిండి విశ్వనాధరాజు నిర్మించే పై సంస్థ తొలి చిత్రం మొదటి షెడ్యూల్ నవంబర్ 4 నుంచి 14 వరకు జరిగింది. జయప్రద, గీత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సారధి, భీమరాజు వగైరా నటవర్గం. మోదుకూరి జాన్సన్, సత్యం, ఎస్. ఎస్. లాల్, బి. చలం, రాధారెడ్డి, నాగేశ్వరరావు, నరసింహరాజు, నాయని మహేశ్వర రావు తెరవెనుక కృషి చేస్తున్నారు. "డిసెంబర్, జనవరి నెల్లో 1 నుంచి 15 తారీఖుల వరకు తదుపరి షెడ్యూల్స్ ఉంటాయి. ఫిబ్రవరిలో పాచ్‌వర్క్ పూర్తిచేస్తాం," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. చంద్రశేఖరరెడ్డి.

'ప్రేమ నక్షత్రం'లో కృష్ణ, శ్రీదేవి



వి. మహేష్ సమర్పించు

ఆదిత్య చిత్ర

# మహాపురుషుడు

కలర్

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: లక్ష్మీదీపక్ నిర్మాత: వి.రోహిణి

శ్రీతారకరామ. ద్వారకా. శ్రీలక్ష్మీజ్యోతి.



SAIKRISHNA ADS.

# సినిమా

## అల్లుడుగారు జిందాబాద్‌లో ముసుగు మనుషులకు ముష్టిదెబ్బలు

రిటైర్డ్ మేజర్ నూకరాజు (రమణమూర్తి) భవంతి... అర్ధరాత్రి... ఒక గదిలో వాసు (శోభన్‌బాబు) ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. కిటికీ బోల్టులు తొలగించి, చల్లగా ఇద్దరు ముసుగు దొంగలు లోనకు ప్రవేశించారు. ఇనప్పెట్టె దగ్గరికి పోతూండగా టీపాయ్‌కి ఒక దొంగ కాలు తగిలింది. ఆ చప్పుడుకు వాసు లేచాడు. ఇనప్పెట్టె తలుపులు తెరవడానికి ప్రయత్నిస్తున్న ఆ వ్యక్తులను ఫెడేల్ ఫెడేల్‌మని తన్నాడు. కాస్సేపటికి ఆ దెబ్బలకు తట్టుకోలేని పెద్ద దొంగ ఆయాసంతో "ఇదుగో ఆగవయ్యా! నేను చెప్పేది కాస్త వినవయ్యా. ఈ ఇంటికి నువ్వు కొత్తవాడివే కదా? ఈ సిపాయోడి దగ్గర ఇనప్పెట్టెలో లక్షలు లక్షలు మూలుగుతున్నాయి. నువ్వు గమ్మున ఉంటే, చెరో అయిదు లక్షలు పంచుకుందాం," అన్నాడు.

"ఏమిటీ, అయిదిస్తావా?" అంటూ మెడమీద కొట్టాడు వాసు.

గిరగిర తిరుగుతూ దబ్బున కిందపడ్డాడు దొంగ. ఆ గొడవకు గీత (గీత), ఆమె తల్లి తాయారు (శ్యామల) గాభరాతో అక్కడికొచ్చారు. దొంగను పైకి లేపి, ముసుగు తొలగించాడు వాసు. అదెవరో కాదు; మేజర్ నూకరాజే! మరొక దొంగ నూకరాజు అసిస్టెంటు.

గీత "నాన్నా!" అంటూ, తాయారు "ఏమండీ!" అంటూ ఆశ్చర్యంతో దగ్గరికొచ్చారు.

"ఇదేమిటండీ? మీ ఇంట్లో మీరు దొంగతనానికి రావడం ఏమిటి?" అడిగాడు వాసు.

"అదే నీకు పరీక్ష," అన్నాడు నూకరాజు.

"అదేం టెస్ట్ డాడీ?" అంది గీత.

"అవునమ్మా! ఇతను నిజంగా నీమీద ప్రేమతో వచ్చాడో - లేక నా డబ్బుమీది మోజుతో వచ్చాడో తెలుసుకోవాలని పరీక్ష పెట్టాను. ఇతను నెగ్గాడు... నీ నిజాయితీకి చాలా గర్విస్తున్నానోయ్, వాసూ! కాని, నువ్వుగనుక నిజంగా నా డబ్బుమీది మోజుతో వచ్చి ఉంటే, ఈపాటికి ఈ తుపాకీలోని గుళ్ళు నీ గుండెల్లోంచి దూసుకుపోయి ఉండేవి... ఊఁ... మీరిద్దరూ వెళ్లి రెస్ట్ తీసుకోండి," అన్నాడు నూకరాజు. వాసు, గీత ఒకేవైపు వెళ్లబోతూండగా "హాల్ట్! అమ్మాయ్, నీ రూమ్ అటు. వాసూ, నీ రూమ్ ఇటు," అంటూ దారి చూపించి, తీవిగా భార్యవైపు తిరిగాడు.

అందరూ నవ్వుకున్నారు.

కట్టా సుబ్బారావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో, ఎం. రామకృష్ణారెడ్డి నిర్వాహణలో ఎం. శ్యామలారెడ్డి నిర్మించే సుమన్ క్రియేషన్స్ "అల్లుడుగారు జిందాబాద్" చిత్రంలో శారద, మమత, సువర్ణ, సత్యనారాయణ, గుమ్మడి, పి. ఎల్. నారాయణ, కాకరాల, మోదుకూరి సత్యం ఇతర పాత్రధారులు. గొల్లపూడి, చక్రవర్తి, వేటూరి, వెంగయ్య, భాస్కరరాజు, నరసింహారావు, డి. చంటి ప్రభృత సాంకేతికవర్గం.



'పక్కింటి అమ్మాయి'లో చంద్రమోహన్, జయసుధ



'కిరాయి రౌడీలు'లో మోహన్‌బాబు, వనిత, సువర్ణ

## చిత్తూరులో కిరాయి రౌడీలు

"చిత్తూరు జిల్లా తలకోనలో షూటింగ్ ముగించుకువచ్చాం," అన్నారు క్రాంతికుమార్. శ్రీ క్రాంతి చిత్ర యూనిట్ సభ్యులు దాదాపు రెండు వందలమంది అక్టోబర్ 20 నుండి నవంబర్ 1 వరకు ఔట్‌డోర్ షూటింగ్‌లో పాల్గొన్నారు. ఆ నిర్మాత ఇంకా అన్నారిలా: "ఆ లొకేషన్‌లో దాదాపు 250 అడుగుల నుండి దూకే జలపాతం ఎంతో మనోహరంగా ఉంది. జాంభారా కోయజాతి వారి స్థావరాలను అక్కడ ప్రత్యేకంగా నిర్మించాం. వాటి మధ్య జాంభారా నాయకునితో, మోహన్‌బాబుతో చిరంజీవి ఫైట్స్ చాలా థ్రిల్లింగ్‌గా పిక్చరైజ్ చేశాం. ఇంకా రాధిక, సువర్ణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, అత్తిలి లక్ష్మి పాల్గొన్న కొన్ని సీన్లు కూడా షూట్ చేశాం. ఇంకో రెండు పాటల వర్క్ మిగిలి ఉంది. డిసెంబర్ చివరి వారంలో రిలీజ్ చేస్తాం. మొత్తంమీద – ఆ తలకోన లొకేషన్‌లో తొలిసారిగా షూట్‌చేసే ఘనత మా డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డికి, కెమెరామన్ వెంకట్‌కే దక్కింది." శ్రీ క్రాంతి చిత్ర వారి "కిరాయి రౌడీలు" చిత్రానికి సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం ఇతర హంగులు.



కె.సి.శేఖర్‌బాబు
సమర్పించు

నాగార్జున ప్రొడక్షన్స్

# పక్కింటి అమ్మాయి

ఈస్ట్‌మన్ కలర్

ఎ.సారథి ❋ కె.వాసు

చక్రవర్తి • సత్యానంద్ • ఎస్.గోపాలరెడ్డి • నాయని మహేశ్వరరావు



నైజాం: శ్రీ సాయికృష్ణ  సీడెడ్: భాస్కర్ పిక్చర్స్

SAI KRISHNA ADS

విష్ణుప్రియా ప్రొడక్షన్స్

# కోడళ్ళొస్తున్నారు జాగ్రత్త!

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి

దర్శకత్వం:
కట్టా సుబ్బారావు

నిర్వహణ
బొడ్డులూరి యర్రమంద





SREE PUBS

సీడెడ్:
వి.యం.సి







'గూటిలోని రామచిలుక'లో
మోహన్‌బాబు, జయమాలిని

## కాళి సినిమాస్కోప్ చిత్రం త్వరలో విడుదల

ఫారన్ పిక్చర్సు మరిపిస్తున్నామా – అనిపిస్తుంది సుజాత ఫిలిమ్స్ (ప్రై) లిమిటెడ్ వారి "కాళి" సినిమాస్కోప్ కలర్ చిత్రాన్ని చూస్తుంటే. దీని దర్శకుడు ఐ. వి. శశి మలయాళంలో తొంభై శాతం చిత్రాలను హిట్ చేసిన ప్రముఖుడు. రజనీకాంత్, చిరంజీవి, సీమ, జయలక్ష్మి, రీనా, వెన్నిరాడై నిర్మల, పుష్పలత, సత్యనారాయణ, గిరిబాబు, కాంతారావు, ప్రసాద్‌బాబు, రాజన్‌బాబు పాల్గొన్నారు. గొల్లపూడి మాటలు, వేటూరి పాటలు, అశోక్‌కుమార్ ఛాయ, ఇళయరాజా సంగీతం ఇతర ఆకర్షణలు. తొలుత శిల్ప దర్శకుడుగా సినిమా రంగ ప్రవేశం చేసిన ఐ. వి. శశి కొన్ని చిత్రాలకు ఛాయాగ్రాహకుడుగానూ పనిచేశారు. "హర్ నైట్స్" ఆధారంగా హిందీలో తయారైన "పతిత" చిత్రానికి ఈయనే దర్శకుడు. "త్వరలోనే మల్టీ స్టార్స్‌తో సినిమాస్కోప్‌లో తయారయ్యే ద్విభాషా చిత్రాన్ని డైరెక్ట్ చేయబోతున్నాను," అన్నారు శశి.



'ఇంద్రుడు–చంద్రుడు'లో శ్రీధర్

# సినిమా

## ఊరికి మొనగాడు

"ఆగస్ట్ 1 నుంచి 10 వరకు కూళ్ళ గ్రామంలో రెండవ షెడ్యూల్ జరిగింది," అన్నారు గోపీ మూవీస్‌వారి పై చిత్రానికి దర్శకత్వం నెఱపే కె. రాఘవేంద్రరావు. కృష్ణ, జయప్రద, చంద్రమోహన్, గీత, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, రాజ్యలక్ష్మి (శంకరాభరణం), ప్రసాద్‌బాబు పాల్గొన్న ముఖ్యమైన సన్నివేశాలెన్నో చిత్రీకరించారు. సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, కె. ఎస్. ప్రకాష్, శ్రీనివాసరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు సాంకేతికవర్గం. "కూళ్ళ గ్రామంలోనే సెప్టెంబర్ 1 నుంచి 15 వరకు చివరి షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు నిర్మాత ఎ. గోపాలకృష్ణ.

చిత్రాల్లో పాత్రల ద్వారా ఆదర్శాలు పలికే యువ కథానాయకుడు నారాయణరావు నిజజీవితంలో శ్రీ అడుసుమిల్లి రామకృష్ణారావుగారి ద్వితీయ పుత్రిక చి. సౌ. అనూరాధని శుభలేఖలు, మంగళ సూత్రం, మేళతాళాలు లేకుండా మద్రాసు సవేరా హోటల్‌లో నిరాడంబరంగా దండలు మార్చుకునే వివాహం చేసుకున్నారు. పెళ్ళిపెద్దలు, సాక్షులుగా శ్రీయుతులు కాట్రగడ్డ శ్రీనివాసరావు, శ్రీ రామఅరంగణ్ణ, కె. బాలచందర్‌గారలు వ్యవహరించారు. నూతన వధూవరులను అభినందిస్తున్న శ్రీ ఎన్. టి. రామారావుని చిత్రంలో చూడవచ్చు. చిత్ర పరిశ్రమ ప్రముఖులు, పెద్దలనేకులు ఈ వివాహానికి విచ్చేసి వధూవరుల నాశీర్వదించారు.





'సీమటపాకాయ్ 1, 2, 3'లో
కుమారి మంజుల

## దాసరి దర్శకత్వంలో పద్మాలయా చిత్రం

"మాయదారి మల్లిగాడు" ఆధారంగా హిందీలో కృష్ణ సమర్పించే చిత్రం షూటింగ్ నవంబర్‌లో ప్రారంభమవుతుంది. జితేంద్ర హీరో. దాసరి దర్శకుడు.




# కేటుగాడు

కలర్

నిర్మాత: వి. వెంకట్రావు సంగీతం: కె.వి. మహాదేవన్

లక్ష్మి ఫిలింస్

LAKSHMI PUBS

## ఆగస్టులో "పంచప్రాణాలు" రెండవ షెడ్యూల్

శ్రీధర్, శరత్‌బాబు, ప్రసాద్‌బాబు, ప్రభాకరరెడ్డి, జగ్గయ్య, డి. ఎస్. విజయ, టి. రాజేశ్వరితోపాటు కొత్త నటులు వడ్డి వెంకటేశ్వర్లు, శ్రీరామమూర్తి, రాజేష్‌బాబు,

# సినిమా

చక్రవర్తి, సుబ్బరాజు పాల్గొనే రామచంద్ర శ్రీ ఆర్ట్స్ వారి పై తొలిచిత్రం రెండవ షెడ్యూల్ ఆగస్టు రెండవ వారంలో మొదలవుతుందని, తొలి షెడ్యూల్‌లో ఐదు రీళ్ళు తయారైందని నిర్మాత సారథి కె. వెంకట్రావు తెలిపారు. మధురాధర్ కథ, మాటలు రాశారు. ఉపేంద్రకుమార్ సంగీతం, మండేవ్ ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, చిన్ని నృత్యాలు, ఎ. వి. ఎల్. నరసింహారావు సహకార దర్శకత్వం, కుమార్ ప్రొడక్షన్స్ నిర్వహిస్తున్నారు. "ఇది సైంటిఫిక్ హారర్ క్రయిమ్ చిత్రం," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బాధ్యతలు చేపట్టిన ఎస్. గోపాల్.



బంగారు లక్ష్మి'లో జయసుధ

## మదన మంజరిలో మరణ గండం

అడవిలో రాజు ధర్మశీలుడు (రాజకుమార్), మంత్రి సుగుణవర్మ (నాగరాజు) విశ్రాంతి తీసుకుంటున్నారు. వారి కళ్లెదుట కొన్ని విచిత్రాలు జరిగాయి. ఒక కర్ర పాముగా మారి, ఒక భటుడ్ని కాటు వేసి, తిరిగి కర్రగా మారింది. మరో క్షణంలో పులిగా మారి ఒక మనిషిని చంపి, తిరిగి కర్రగా మారింది. ''ఏమిటీ వైపరీత్యం ?'' అంటూ రాజు ఆ కర్ర వంక తిరిగి, ''ఓరీ, మాయావీ! ఎవర్నువ్ ? భూతానివా, ప్రేతానివా? మాయలు తెలిసిన మంత్రగాడివా ?'' అన్నాడు.

''అందులో ఎవ్వరినీ కాను,'' అంటూ ఆ కర్ర వికృతంగా నవ్వి, ''మృత్యువును. ఆ విధిరాతననుసరించి జీవుల్ని చంపడం నా విధి,'' అంటూ మరో ఆకృతి దాల్చింది.

''ఐతే, మా మరణ రహస్యం కూడా నీకు తెలిసే ఉంటుంది. చెప్పు !'' అన్నాడు రాజు.

''రాజా ! నీకు మృత్యు గండమేలేదు. సరిగ్గా నీ నూరవ ఏట రాచపుండు రూపంలో నిన్ను పీడించి, నీ బ్రతుకును పరిసమాప్తి చేస్తాను,'' అంది మృత్యువు.

''అలాగే ... నా మరణ రహస్యాన్ని కూడా చెబితే – '' అన్నాడు మంత్రి ఆతృతతో.

''ఈ మాసంలోనే మంత్రివరేణ్యులకు మృత్యు గండమున్నది,'' అంది మృత్యువు.

మంత్రి నిర్ఘాంతపోయాడు. ''నీవు చెప్పింది నిజమా ?'' అని అడక్కుండా ఉండలేకపోయాడు.

''ముమ్మాటికీ నిజం. నీకు మరణం తథ్యం!'' అంటూ మృత్యువు అదృశ్యమైపోయింది.

రాజు, మంత్రి నిశ్చేష్టులైపోయారు.

దర్శక నిర్మాత బి. విఠలాచార్య రూపొందించిన ''మదన మంజరి'' అతి త్వరలో విడుదల.

## తెలుగు సినీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ ఎన్నికల ఫలితాలు

ఆగస్టు 10న జరిగిన సర్వసభ్య సమావేశంలో ఈ క్రిందివారు ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. అధ్యక్షులు : యు. కృష్ణంరాజు. ఉపాధ్యక్షురాలు : షావుకారు జానకి. కార్యదర్శి : డాక్టర్ ఎం. ప్రభాకర రెడ్డి. కోశాధికారి : అల్లు రామలింగయ్య. సహకార్యదర్శి : కె. జె. సారధి. కార్యవర్గ సభ్యులు : గుమ్మడి వెంకటేశ్వరరావు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, కైకాల సత్యనారాయణ, రావు గోపాలరావు, మురళీమోహన్, జె. వి. రమణమూర్తి, మాదాల రంగారావు, కొంగర జగ్గారావు, జయచిత్ర, హేమాచౌదరి.

## ఇద్దరు ప్రముఖుల అస్తమయం!

సుప్రసిద్ధ శిల్ప దర్శకుడు ఎ.కె. శేఖర్(72) ఆగస్టు 19న నిధనులయ్యారు. వాహినీ, జెమినీ, ఎ. వి. ఎం. లాంటి ప్రముఖ సంస్థలు తయారు చేసిన ఎన్నో కళాఖండాలకు శిల్ప దర్శకుడుగానూ, కొన్నిచిత్రాలకు శబ్దగ్రాహకుడుగానూ పనిచేసిన ఈయన నిగర్వి, నిండుకుండ, నిరాడంబరజీవి. ''శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కథ'' చిత్రానికి ఈయన దర్శకత్వం నెఱపారు కూడా

తనకంటూ సొంత బాణీ రూపొందించుకొని, తెలుగు భాషను – రచయితలను ప్రభావితం చేసిన సుప్రసిద్ధ రచయిత, విప్లవభావుకుడు, విమర్శకుడు, పత్రికా సంపాదకుడు, మహామనీషి కొడవటిగంటి కుటుంబరావు (72) ఆగస్టు 17న గుండెపోటుతో దివంగతులయ్యారు. ''తారుమారు – భలే పెళ్ళి'' అనే హాస్యచిత్ర ద్వయానికి రచయితే కాకుండా ''తారుమారు'' చిత్రంలో ప్రధానపాత్ర ధరించారు కూడా. ఈయన మృతికి ప్రగాఢ సంతాపం వ్యక్తం చేస్తూ తెలుగు ఫిలిమ్ జర్నలిస్టుల సమితి సభ్యులు ఆగస్టు 25న శ్రద్ధాంజలి ఘటించారు. ★

'శుభోదయం'లో సులక్షణ



# గణపతిని గురించిన రెండు

**ఒకటి –**

ఒకప్పుడు అగస్త్యమహాముని కి కావేరీనదిపై ఎందుకో కోపం వచ్చింది. ఆ ముని ఆ నదీ జలాన్నంతటినీ తన కలశంలో బంధించి తనదగ్గిరనే ఉంచుకున్నాడు. సముద్రాన్నే ఆపోశనం పట్టిన ఆ మహర్షికి ఇది ఒకలెక్కా ?

ఈ సంఘటనకు దేవతలందరూ తహతహలాడిపోయారు. ఇంద్రుడికి గుండె దిగులు పట్టుకుంది. ఆ నది లేకపోతే ఎలాగ ? ప్రపంచం తల్లక్రిందులౌతుందే ! అగస్త్యుణ్ణి శాంతింపజెయ్యడానికి ఎవ్వరి తరమౌతుంది ? ఎదటపడితే తమకు ఏమి ఉపద్రవం కలుగుతుందో అని అందరికీ భయమే ! అప్పుడు యింద్రుడు గణపతివద్దకు వచ్చి లోకాన్నుద్ధరించాలని ప్రార్థించాడు. బుద్ధిలోనూ, యుక్తిలోనూ ఎంతో సమర్థుడైన ఆ గుజ్జువేలుపు కాకి రూపంతో వచ్చి అగస్త్యుని కమండలంపై తన దాహం తీర్చుకోడానికా అన్నట్లు తటాలున వాలాడు. ఆ వేగానికి కమండలం దొర్లిపోయింది. అందులో ఒక నీటిచుక్కా మిగలలేదు. ఇలా తన కోరిక నెరవేర్చుకొని, కాకిరూపంలో ఉన్న గణాధిపతి వెంటనే ఎగిరిపోయాడు. ఇంద్రుడి దిగులు పోయింది. దేవతలందరూ పరమానంద భరితులయ్యారు.

**రెండు –**

శివభక్తులలో అగ్రగణ్యుడైన రావణుడు ఒకనాడు మహేశ్వరుడి దగ్గరకు పోయి ఆత్మలింగాన్ని తనకు అనుగ్రహించాలని ప్రార్థించాడు. రావణుని సామగానానికి తృప్తిపడిన శంకరుడు ముందు వెనక లాలోచించకుండా రావణుడికి ఆత్మలింగాన్ని ఇచ్చాడు. అది ఎవరిదగ్గర వుంటే – ఆతణ్ణి ఎవ్వరూ జయించలేరు. ఈ విషయం తెలిసి దేవతలు మిక్కిలి తల్లడిల్లిపోయారు. ఆ లింగాన్ని యిచ్చిన శివుడే నాలిక కరుచుకోవలసివచ్చింది. వెంటనే ఆయన "రావణా ! నీకు ప్రాణప్రదమైన యీ ఆత్మలింగాన్నిస్తున్నాను. దీనిని నీవు దారిలో ఎక్కడా నేలమీద పెట్టకూడదు సుమా ! నేలమీద పెడితే, ఇది అక్కడే వుండిపోతుంది. అక్కడినుంచి కదలదు. జాగ్రత్త !" అని అన్నాడు. "సరే" అని రావణుడు తల ఊపి కైలాసం నుంచి లంకకు బయలుదేరాడు. దేవతలకు ఈ సంగతిన్నీ తెలిసింది. వారు గణపతి వద్దకు వచ్చి, ఎలాగయినా ఆ ఆత్మలింగం రావణుడికి దక్కకుండా ఉండేటట్లు చెయ్యాలని వేడుకొన్నారు. గణపతి ఒక బ్రహ్మచారిగా మారి, రావణుడికి తెలియకుండా అతణ్ణి వెంబడించాడు. రావణుడు పడమటి సముద్రతీరానికి వెళ్ళేసరికి సాయం సంధ్యా సమయమయింది. లంకకు వెళ్ళడానికి యింకా కొంతసేపు పడుతుంది. అప్పటికి కాలాతీతమైపోతుంది. ఇక్కడే సంధ్యావిధి నిర్వర్తించాలి. మరి, లింగాన్ని నేల దించకూడదు గదా ! దాన్ని చేతులో ఉంచుకొని అర్ఘ్యప్రదానం ఎలా చెయ్యడం ? ఏమి చెయ్యడానికీ అతనికి తోచలేదు. నలువైపులా చూశాడు. తనకు వెనకగా వస్తూవున్న కపట బ్రహ్మచారి రావణుని కంటబడ్డాడు. పరమానంద భరితుడైనాడు. అతణ్ణి దగ్గిరకి పిలిచి "బాబా ! చిన్న ఉపకారం చేసిపెట్టు. నేను శీఘ్రంగా సంధ్య

# క థ లు...

వార్చి అర్ఘ్యప్రదానం చేసి వస్తాను. అంతవరకూ ఈ లింగాన్ని చేతితో పట్టుకొనివుండు. కొంత బరువుగా వుంటుందని నేలమీద పెట్టకుమీ! లంకకు పోయి సంధ్య వార్చుకోవాలంటే కాలాతీతమయిపోతుంది. నీ వుపకారం మరిచిపోను'' అన్నాడు.

బ్రహ్మచారి ''సరే! అలాగే పట్టుకుంటాను. బరువు భరించలేకపోతే మాత్రం నేలమీద పెట్టేస్తాను. ముందుగా నిన్ను మూడుసార్లు పిలుస్తాను. మూడో పిలుపుకయినా నీవు రాకపోతే – నన్ను నిందిస్తే – లాభంలేదు'' అని అన్నాడు.

రావణుడు తలవూపి ఆ లింగాన్ని అతని చేతికిచ్చాడు.

నీటివద్దకు పోయి రాక్షసరాజు సంధ్యావిధి ప్రారంభించి, అర్ఘ్యప్రదాన ఘట్టానికి ఇంకా రాకుండానే, బ్రహ్మచారి 'బరువు మొయ్యలేకుండా ఉన్నాను. రావలె'నని పిలిచాడు. తర్వాత – అర్ఘ్యప్రదాన ఘట్టానికి వచ్చేసరికి రెండవ పిలుపు వచ్చింది. అర్ఘ్యప్రదానం చేస్తూవుండగా ''ఇక మొయ్యలేను. వేగంగా రాకపోతే దీనిని నేలమీద పెట్టేస్తున్నాను'' అని బ్రహ్మచారి గట్టిగా అరిచి రావణున్ని పిలిచాడు. ''ఇదిగో వస్తున్నాను'' అని అంటూ రావణుడు చెలియలికట్ట ఎక్కి వచ్చేసరికి ఒక నిమిషం ఆలస్యమయింది. అతడు వచ్చేసరికే మాయా వటుడు ఆత్మలింగాన్ని నేలపై పెట్టాడు. అతని శరీరం శ్రమవల్ల చెమటలు కారిపోతున్నది.

రావణుడు ఆ లింగాన్ని కదిపిచూశాడు. కదలలేదు. అతడు విశ్రాంతపోయాడు. పడిన శ్రమ అంతా వ్యర్థం అయిపోయింది.

దేవతలు ఎంతో సంతోషించి గణపతిని అనేక విధాల కొనియాడారు.

—"అంగీరస"

### తేడా

ఐదు పైసలకీ
ఐదు రూపాయలకీ
వెనుక ఒకే బొమ్మ –

ముసలి తాతకీ
ముద్దుల పాపకీ
బోసినవ్వే భూషణం –

మహా మేధావికీ
మూర్ఖ శిఖామణికీ
పట్టుదల మెండు –

లక్షణమొకటే అయినా
లక్ష్యం మాత్రం వేరు –

– ఎమ్వీ రమేష్



క్షణం తీరిక వుండదు. నిలబడ్డపళంగ ఎలా వచ్చేస్తారు, అనుకుంది.

ఆమెకు మనసులో కోపం మెల్లమెల్లగా కరిగిపోయి అదే స్థానంలో అతనిపై ప్రేమాను రాగాలు పీఠం వేసుకు కూర్చున్నాయి.

"ఏం వెళ్తావా !" అడిగాడు.

"ఊహు !" తలతిప్పింది.

"ఏం ! నేను వెళ్ళమంటున్నానుగా !" ఆశ్చర్యంగా అన్నాడు.

"ఊహూ ! నేను మిమ్మల్ని విడిచి ఎక్కడికీ వెళ్ళలేను. వెళ్ళినా క్షణం వుండలేను." అంటూ మనసులోవున్న మాట చెప్పేసి భర్త గుండెల్లో తల దాచేసుకుంది.




భార్య నోటినుండి ఆ మాటలు వెలువడగానే అంతులేని అనురాగంతో ఉప్పొంగిన సంతోషంతో ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు.

మర్నాడు గోవిందమ్మ, విశాలి వచ్చారు. ఆ రోజు అంతా వాళ్ళని వుంచేసింది. మల్లికార్జున రావు వచ్చేవేళకు వెళ్ళడానికి బయలుదేరిపోయారు. వూరికి వెళ్ళి మళ్ళీ ఇరవై రోజుల్లో వస్తామని చెప్పి వెళ్ళిపోయారు.

## 29

ఆ రోజు సాయంత్రం నాలుగున్నర గంటలకు ఒకావిడ లోపల హాలులోకి చొరవగా వచ్చేసింది.

అటు పనివుండి అలా వెళ్తున్న హరిత హాలులోకి చూసింది. ఓ అపరిచిత ఆవిడ హాలులో నిలబడటం చూసి తెల్లబోయింది. "ఈవిడ ఎవరు ? లోపలకు ఎలా వచ్చింది ? నౌకర్లు ఎవరూ అక్కడ లేరా !" అనుకుంటూ హాలులోకి వస్తూ,




# మువ్వల మురళి

[30 వ పేజీ తరువాయి]


"ఎవరు కావాలండీ ?" అంటూ మర్యాదగా ప్రశ్నించింది హరిత.

వచ్చిన ఆవిడ తెల్లచీర, తెల్లజాకెట్, కళ్ళకు అద్దాలు. తల నెరిసింది. ముడివేసుకుంది. కొద్ది లావుగావుంది. చేతిలో సంచి వుంది. హరితను చూస్తూనే ఆవిడ ముఖం సంతోషంతో విప్పారింది.

"అమ్మాయ్ ! లాయర్ బాబూగారు ఇంట్లో వున్నారా ?" అంటూ ప్రశ్నించింది.

"కోర్టునుండి ఇంకా రాలేదు "

"ఎన్ని గంటలకు వస్తారు ?"

"వచ్చే టైము అయింది. ఇప్పుడు వచ్చేస్తారు."

"అయితే ఆ బాబు వచ్చేవరకూ నేను కాస్సేపు కూర్చోవచ్చునామ్మా ?" బ్రతిమాలుతున్నట్లే అడిగింది.

"అయ్యో ! అలా అడుగుతారేమిటి ? అలా కూర్చోండి" అంటూ ఆవిడ్ని కూర్చోమంటూ అక్కడ సోఫా చూపించింది.

ఆవిడ పొంగిపోతూ ఇంత మొఖం చేసుకుని సోఫాలో కూర్చుంది. తనూ అక్కడే కూర్చుని, నౌకర్ని పిలిచి బోర్నవిటా తెమ్మని చెప్పింది.

ఒక అయిదు నిముషాలు తరువాత నౌకరు బోర్నవిటా పట్టుకువచ్చి ఆవిడకు ఇచ్చాడు. అంత పేరున్న లాయర్ ఇంట్లో తనకు అంత గొప్పగా మర్యాద చేసినందుకు ఆవిడ ఉబ్బితబ్బిబ్బు అయిపోయింది.

"అమ్మాయ్ ! నీ పేరు ఏమిటి ?" అంటూ ప్రశ్నించింది.

"హరిత" అంటూ చెప్పింది నవ్వుతూ.

" లాయర్ బాబూగారికి నువ్వు ఏ అవుతావు ?" ఆవిడ కళ్ళద్దాలు సరిచేసుకుంటు ముఖం కొద్దిగా పైకి ఎత్తి కళ్ళద్దాల్లోంచి పరీక్ష చూస్తూ ప్రశ్నించింది.

ఆవిడ ప్రశ్నకు చిరునవ్వు నవ్వి అంది "మావారే !"

ఆ మాట వినటంతోనే ఆవిడ కనుగుడ్లు అలా నిలబడిపోయాయి. రెప్ప వెయ్యటం మరిచి ఆమెవైపే క్షణం సేపు అలా చూసింది. ఆయోమయంగా, 'నిజమా ! నా చెవులు నన్ను మోసగించటం లేదుకదా !' అన్నట్లు ఆవిడ చూపులూ ఆశ్చర్యం చూసి చిరాకు వేసింది ఆమెకు.

"ఏమిటి అంత ఆశ్చర్యం. ఆయనకి భార్యని నేను తగనని ఈవిడ వుద్దేశం!" హరిత మనసులో కోపంగా అనుకుంది.

"నిజమా అమ్మాయ్ ! నువ్వు ఆయన భార్యవా ?" ఇంకా నమ్మకం కుదరక చేతో బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"ఏమిటి అంత ఆశ్చర్యపోతున్నారు ! మా పెళ్ళి అయి మూడు నెలలు అవుతూంది" అంది రాని నవ్వుని బలవంతంగా పెదవులమీదకు తెమ్ము కుంటూ. మనసులో మాత్రం కోపం పీకల దాకా వుంది ఆవిడమీద.

"అందం విషయంలో ఆయన దగ్గర తను తీసికట్టుగా వుంది అని అవమానిస్తుంది ఏమో !' అని అనుమానంకూడ మనసులో మెదిలింది.

"అయితే మా వీధిచివర యింటిలో వుంటున్న రోజారాణి అనే అమ్మాయి ఎవరు ? ఆమె మీకు ఏం అవుతుంది ?"

"రోజారాణియా ! మాకు ఏం తెలీదు. నేను ఎప్పుడూ ఆ పేరు కూడా వినలేదు" అంది మామూలుగా నుదురు చిట్లించి అర్థం కానట్టు చూస్తూ !

"వినలేదూ !" ఆవిడ ఇంకా ఆశ్చర్యపోయింది ఆ మాట వింటూ.

హరితకు మహా చిరాగ్గావుంది ఆవిడ దగ్గర కూర్చుని కబుర్లు వినాలి అంటే. నేరకపోయి ఆవిడ్ని కూర్చోమన్నాను. ఆయన వచ్చాక అయినా రమ్మన్నాను కాదు. మనసులో విసుక్కుంది.

"ఏమిటి అమ్మాయ్ ! నీ మాటలు వింటుంటే నమ్మాలా, నమ్మకూడదా అనిపిస్తుంది. లాయర్ బాబుగారు ప్రతిరోజూ ఆ యింటికి వస్తుంటారు. ఈమధ్య ఆ అమ్మాయి తల్లికూడా పోయింది. లాయర్ బాబుగారు ఒక్కోసారి రాత్రులుకూడా అక్కడే వుండిపోతుంటారు."

ఆవిడ మాటలు వింటూనే హరిత తలపై వేలాది పిడుగులు ఒక్కసారి వర్షించినట్టు అయ్యాయి. ప్రపంచం అంతా గిర్రున తిరిగిపోయినట్టు అయి భూమి బ్రద్దలై తను అందులో కూరుకుపోతున్నట్టు అయింది. కళ్ళు చీకట్లు కమ్మేస్తుంటే స్పృహ తప్పిపోతున్నట్టుగా అనిపించినా బలవంతంగా లేని ఓపిక కూడదీసుకుని మనసులోనే బాధనంతా దాచుకుంటూ పైకి మామూలుగా వుండటానికి ప్రయత్నించసాగింది.

## 30

"ఏమిటి? ఏమిటి మీరు అంటున్నది!" క్షీణస్వరంతో ప్రశ్నించింది.

"ఆమధ్య ఆ రోజా తల్లి హాస్పటల్లో కూడా వుంది. ఆవిడ ఎన్నాళ్ళుగానో మంచంమీద వుందిలే. ఈమధ్య పోయింది. ఆయన చేతులమీదుగానేగా ఆవిడకు అన్నీ చేశారు."

హరిత మాట పల్కా లేని శిలావిగ్రహమే అయింది.

"రోజా, లాయర్ బాబుగారు కారులో సినిమాలకి షికార్లకి వెళ్తుంటారు. ఆ అమ్మాయి బి.ఏ. పాసయింది. ఆయన ఆ అమ్మాయిని ఉద్యోగం చెయ్యనివ్వకుండా ఇంటి ఖర్చులు, ఇంటి అద్దె మొత్తం డబ్బు అంతా ఈయనే ఖర్చు పెడుతుంటారు."

'అలాగా' అన్నట్టు కొత్త విషయం ఏదో వింటున్నట్టుగా చూసింది హరిత.

"ఏమిటి అమ్మాయ్! ఈ సంగతులు ఏమీ నీకు తెలీదా! రోజా గురించి ఎప్పుడూ ఆయన నీ దగ్గర అనలేదూ!" అంది ఆవిడ ఇంకా ఆశ్చర్యపోతూ!

ఖిన్నవదనంతో చూసింది ఆవిడవైపు.

"అయితే ఆ రోజాకి, లాయర్‌బాబుగారికీ ఏమిటి సంబంధం!"

హరిత జవాబు ఇవ్వలేదు. కళ్ళల్లో కోటి అనుమానాల అలలు ఎగిసెగిసి పడుతున్నాయి. మనసులో కోటి శంకలు బయలుదేరి ఆమెను ఎక్కడా నిలవనీయటంలేదు.

ఆవిడకు పరిస్థితి అంతా అర్థం ఐపోయింది. ఆవిడకు సగం వయసు అయిపోయింది. జీవితంలో ఎన్నో కష్టనష్టాలు భరించింది. ఇలాంటివి ఎన్నో చూసింది. అవి మామూలే! ఈ లోకంలో భార్యలను మోసగించి వాళ్ళ కళ్ళు కప్పి బజార్లలో దొరికే సుఖాల కోసం వెర్రిగా అర్రులు చాచేవాళ్ళు వున్నారు. అలాగే భర్తలను మోసగించి వాళ్ళ కళ్ళు కప్పి తమ వయసూ సొగసులను పరాయి మగవాడికి అర్పించుకునే అతివలు వున్నారు ఈ లోకంలో!

ఆవిడకు హరితపై నిజంగా జాలేసింది.

"పాపం! చిన్నవయసు. నీకు తీరు బొత్తిగా అర్థంకాదు." జాలిపడ్తూ అంది.

"బాగా సంపాదించే మగవాడ్ని చూస్తే ఎవరి కళ్ళు అయినా కుట్టాయి అందులోకి ఈ లాయర్ బాబు దొరలా వుంటారు. ఏ ఆడది అయినా ఇట్టే గేలం వేసి లాగుతుంది. ఆ రోజా పైకి ఏం తెలియనట్టు మెత్తగా వుంటుంది. అమ్మో! మొత్తానికి ఈ లాయర్ బాబునే బుట్టలో వేసేసింది. నాకు అప్పుడే అనుమానం వచ్చింది సుమా!" అంది.

"చూడమ్మా! నా ది బుద్ధి పొరపాటు అయి ఆ అమ్మాయి ఎవరో తెలుసుకుందామని అడిగాను. నిన్ను బాధ పెడదామని కాదు. అసలు లాయర్ బాబుకి పెళ్ళి అయిందనే నాకు తెలీదు. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటారు కాబోలు అనుకుంటున్నాను. చూడమ్మా! నువ్వేం బాధపడకు. మగవాళ్ళ బుద్ధే అంత. వాళ్ళని తనవైపుకి తిప్పుకుని కొంగుకి ముడివేసుకునే నేర్పు భార్యకు వుండాలి. కాబట్టీ నేను పెద్దదాన్ని చెపుతున్నాను విను. ఇంతవరకూ జరిగింది మర్చిపో. ఇక ముందు నీ భర్త తప్పుడు త్రోవ తొక్కకుండా చూసుకోవాలి. పసివాళ్ళు ఏముంది, భగభగమండే నిప్పులు వాళ్ళ కళ్ళకి అందంగా కనిపించి అటే పరుగులు తీస్తారు. అలాగే ఈ మగవాళ్ళుకూడా! వాళ్ళ మనస్తత్వం అంతే! వాళ్ళని అటు పరుగులు పెట్టకుండా ఆపాలి. ఆ పని ఒక్క భార్యవల్లే అవుతుంది. నీకు అర్థం అయిందా" అంటూ జాలిగా చూసింది.

హరితకు గుండెల్లో దుఃఖం సుడులు తిరుగుతూంది.

తలవూపింది 'అలాగే' అన్నట్టు.

ఆవిడ ఇంకేమిటో యింటి విషయాలు అడుగుతూంది. తన విషయాలు చెప్తూంది.

"అయిదు సంవత్సరాలు భూమి డబ్బు ఇవ్వకుండా మరుదులు, బావగార్లు తొక్కిపెట్టేశారు. ఇప్పుడు తనని కూతుళ్ళు, కొడుకు ఎవ్వరూ చూడటంలేదు. రోజులు గడవటం కష్టంగావుంది. ఆ డబ్బు వాళ్ళు ఇస్తారా! లాయర్ బాబుగారి సలహా తీసుకుందామని వచ్చాను" అంటూ చెప్పింది.




హరిత మౌనంగా ఆవిడ మాటలు వింటూ కూర్చుంది.

ఓ అరగంటలో కృష్ణసుమంత్ కోర్టునుండి వచ్చాడు.

అతన్ని చూస్తూనే ఆవిడ లేచిపోయి "నమస్కారం బాబూ!" అంది.

"ఆఁ! నమస్కారం. ఏమిటమ్మా! ఏమిటిలా వచ్చారు" అన్నాడు చిరునవ్వుతో

"మీతో చిన్న పనివుండి వచ్చాను బాబూ!"

"అలాగా! కూర్చోండి" అంటూ అవిడ్ని కూర్చోమని ఎదురుగా సోఫాలో తనూ కూర్చుంటూ విషయం ఏమిటో చెప్పమన్నాడు.

ఆవిడ అతనితో అన్ని సంగతులు వివరంగా చెప్పింది. అన్ని విషయాలు విని, 'మీరు రేపు ఉదయం ఒకసారి రండి' అని చెప్పి మాట్లాడి ఆవిడ్ని పంపేశాడు.

హరిత భర్తని చూస్తూనే ఎప్పుడు లోపలకు వెళ్ళిపోయిందో వెళ్ళిపోయింది. అతను చూడలేదు.

కృష్ణసుమంత్ ఆ రోజు ఎక్కడికీ వెళ్ళలేదు. హరిత గుండెల్లో అగ్ని రాజుకుంటోంది.

అతను నవ్వుతున్నా, కబుర్లు చెపుతున్నా, ఆమెకు ఒళ్ళు మండిపోతూంది. అంతా నటన. ఇన్నాళ్ళు తనపై కురిపించింది అనురాగం కాదు, అనుకుంటే మనసులో దుఃఖం ముంచుకువచ్చింది.

ఎంత ఆపుకుందామనుకున్నా ఆగలేదు మనసు. అసలు విషయం అడిగి తేల్చుకునేవరకూ నిద్ర పట్టలేదు. అందుకే సూటిగా ప్రశ్నించింది భర్తని—

"రోజా ఎవరు?" ఆమె కంఠస్వరం తీక్షణంగా, పదునుగా వుంది.

అతను క్షణం మాట్లాడలేనట్టు అలా వుండిపోయాడు.

"ఆ అమ్మాయికి, మీకూ ఏమిటి సంబంధం!" సూటిగా వచ్చిన ఆ ప్రశ్న అతని గుండెలకి అంబు మొనలా గుచ్చుకుంది.

"మాట్లాడరే! ఎలా చెపితే బాగుంటుంది! ఎలా నమ్మించాలి అని ఆలోచిస్తున్నారా!" హేళనగా ప్రశ్నించింది.

భార్య మాటలకి అతని ముఖం గంభీరంగా మారిపోయింది. హరిత కళ్ళల్లో నిర్లక్ష్యం కొట్టవచ్చినట్టు కనిపించింది. 'ఇవా మీ నాటకాలు' అన్నట్టు చూసింది.

"మీకు అంత మోజుగా వుంటే దాన్నే పెళ్ళి చేసుకోలేకపోయారా! మధ్యన నా గొంతు ఎందుకు కోశారు!" ఆవేశంతో కోపంగా అరిచింది.

"హరితా!" క్రోధావేశాలతో కంగుమంది అతని కంఠస్వరం. కళ్ళల్లో ఎర్రజీరలు అలుముకున్నాయి.

అతని కేకలకి ఏ మాత్రం బెదరనట్టు చూసింది.

"ఎందుకంత రోషం, వున్నమాట అంటే. చేసుకున్న భార్య కళ్ళు కప్పి ఎందుకీ మోసం!"

కృష్ణసుమంత్ మాట్లాడలేదు. బలవంతంగా కోపాన్ని ఆపుకుంటున్నట్టు పిడికిళ్ళు బిగుసుకున్నాయి. పళ్ళు బిగువుని కోపం బిగపడుతుంటే అతని నుదుటిమీద నరాలు ఉబ్బినట్టు అయ్యాయి.

"ఏమిటి! ఏమిటి అలా చూస్తున్నారు? నాకు ఎలా తెలిసిందీ అనా? లేక దీని నోరు ఎలా మూయించాలి అనా? లేక ఏం చెపితే సరిగ్గా అతుకుతుంది అనా? మీరు నాకు జవాబు చెప్పలేరండీ" అంటూ ఆగి, "యు కాంట్ ఆన్సర్ మీ" అంది వస్తున్న దుఃఖాన్ని మింగుకుంటూ, పైకి నిబ్బరంగా వుండడానికి ప్రయత్నిస్తూ.

అతను చూపులు ఎటో వున్నాయి. భార్య వైపు అసలు చూడలేదు.

"కోర్టుకు వెళ్ళి బల్లమీద బలంకొద్దీ బాది గొంతుక చీరుకుని అరవటం కాదండీ గొప్పతనం. ఎదుటి లాయర్‌ని ముప్పతిప్పలు పెట్టి గడగడ లాడించి పల్టీ కొట్టించటంలో లేదండీ గొప్పతనం. కేసు గెలిచిన తరువాత తల ఎగరేసుకుని గర్వంగా తిరగటంలో లేదండీ గొప్పతనం. యింట్లో భార్య అడిగిన ప్రశ్నకు టకీమని సమాధానం ఇవ్వగల

లోకంపోకడ * డోరిమెన్










# ముప్యాల పుంతి

వేర్పు, తెలివితేటలు వుండాలండీ! లా పట్టా పుచ్చుకున్న బుర్రలే తెలివయినవి, అవతలవాళ్ళకి ఆ తెలివితేటలు వుండవని అనుకోవటంలో నిజంగా మీరు పొరపడ్డారండీ'' అంది ఆవేశంగా. కళ్ళల్లో నీరు సుడులు తిరగసాగింది.

కృష్ణసుమంత్ మాట్లాడలేదు:

''మీరు ఎంతో ఉత్తములు, సన్మార్గులు అనుకున్నాను. మీకు కోర్టులు, కేసులూ, క్లయింట్లూ తప్పిస్తే మరో ప్రపంచమే లేదనుకున్నాను. మీ మనసు స్వచ్ఛమైనది అని మీ చిరునవ్వుల్లో, మీ చూపుల్లో, మీ పలుకుల్లో కల్మషమే లేదని పొంగిపోయాను. మీ ప్రేమానురాగాలు నా స్వంతమే అని, మీ మనసులో, మీ ఊహల్లో, మీ హృదయంలో నాది ప్రత్యేకమయిన స్థానం అని మురిసిపోయాను, గర్వించాను ఇన్నాళ్ళు. ఇప్పుడు! ఇప్పుడు జరిగింది ఏమిటి? నా నమ్మకమే నన్ను చూసి ఫకాలున పగలబడి నవ్వింది. నా మనసే నన్ను వెక్కిరించి హేళన చేసింది. నా భర్తే నన్ను మోసగించి పరాయి స్త్రీతో తిరుగుతుంటే లోకమే నన్ను చూసి చాటుగా నవ్వుకుంటుంటే, ఇక నాకు మిగిలింది ఏమిటి? యింటి ఇల్లాలుగా, మీ జీవితంలో పాలుపంచుకున్న అర్ధాంగిగా నాకు గౌరవ మర్యాదలు ఏం దక్కాయి!''

''అల్లుకున్న ఆశలని, పెంచుకున్న మమకారాల్ని, మనసులో ఉద్భవించిన ప్రేమానురాగాలని ఎలా త్రుంచేయను?'' అంటూ చేతుల్లో ముఖం దాచుకుని భోరున ఏడ్చింది.

''మీ మనసు ఇంత కఠినం అనుకోలేదు. మీది ఇంత కసాయి గుండె అనుకోలేదు. మిమ్మల్ని నమ్ముకుని మీచేత తాళి కట్టించుకున్న భార్యకే తీరని ద్రోహం చేశారు. నా నమ్మకాన్ని మట్టిపాలు చేశారు. నా సంతోషాల్ని, సరదాలని సమాధి చేశారు.'' అంటూ గుండెలు పగిలేలా ఏడ్వసాగింది.

కృష్ణసుమంత్ భార్యవైపు మామూలుగా చూశాడు. దగ్గరగా వెళ్ళి ఓదార్చే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

సోఫాలో పడుకుని ఆ రాత్రి అంతా ఏడుస్తూనే వుంది.

/ఇంకా వుంది/

# మీ మరుగుదొడ్డిని చూసి మీకే సిగ్గుగా ఉందా?



మనలో ఎంతో మంది మన మరుగుదొడ్డి పరిస్థితిని చూసి ఇబ్బంది పడుతూంటారు. అదే ఒక సమస్య అయినట్టు. కానీ అంతకన్నా మించినది ఏమిటంటే:

**అశుభ్రమైన మరుగు దొడ్డి క్రిములకు జీవనగృహం. రోగాలకు మూలాధారం. మీ కుటుంబం యొక్క ఆరోగ్యానికి ఒక గండం.**

అందుకే అలాంటి అవకాశం రానివ్వకండి. మీ మరుగుదొడ్డి శుభ్రంగా ఉందని నిశ్చయమేనా? ప్రతి ఉదయం వస్తూ కూడా, మీ పనివాడు సరిగా శుభ్రపరుస్తున్నట్లేనా? లేక హడావిడిగా చేసేస్తున్నాడా? వీటిలో మీకు ఏమైనా అనుమానాలు ఉంటే, నివారణోపాయం శ్యానిఫ్రెష్!

**శ్యానిఫ్రెష్—మరుగు దొడ్డిని బాగా శుభ్రపరిచేది**

**శ్యానిఫ్రెష్ 3 విధాలుగా పనిచేస్తుంది:**

**1. శ్యానిఫ్రెష్ మరకలను పోగొడుతుంది.**

శ్యానిఫ్రెష్ మీ మరుగు దొడ్డిని బాగా శుభ్రపరుస్తుంది. ఎలాంటి మరకలవయినా పోగొట్టే శక్తివంతమైన అంశాలను కలిగినది. తుప్పు మరకలను కూడా మాయం చేస్తుంది. మీ మరుగు దొడ్డి పరిశుభ్రంగా మెరుస్తూంటుంది!

**2. శ్యానిఫ్రెష్ క్రిములను సంహరిస్తుంది.**

అశుభ్రమైన మరుగు దొడ్డి అంటే హానికరమైన క్రిములకు జన్మస్థలం, మామూలు ఫినాయిల్ ఇవ్వలేని రక్షణను శ్యానిఫ్రెష్ మీకు ఇస్తుంది. మీ కుటుంబ ఆరోగ్యాన్ని కాపాడుతుంది.

**3. శ్యానిఫ్రెష్ చెడువాసనలను నిర్మూలిస్తుంది.**

మరుగు దొడ్డిలో చెడువాసనలు చిందుతూంటాయి. ముఖ్యంగా, గాలి సరిగా ప్రసరించని వాటిలో. అందుకే శ్యానిఫ్రెష్‌లో శక్తివంతమైన డియోడరెంటు కూడా ఉంది. అది చెడువాసనలను నిర్మూలించి, మంచి వాతావరణాన్ని సృష్టిస్తుంది.

**శ్యానిఫ్రెష్ వాడకం చాల సులభం!**

నిజానికి మీరు చేసేదేమీ లేదు. మొదట మరుగు దొడ్డిని ఫ్లష్ చేసి శ్యానిఫ్రెష్‌ను మరుగు దొడ్డి లోపల అంతా విరివిగా చల్లండి. 3-4 గంటలు అలా ఉంచండి. రాత్రి అంతా అయితే మరీ మంచిది. తర్వాత మళ్లీ ఫ్లష్ చేయండి. ఫ్లష్ పనిచేయకపోతే ఒక బకెట్టు నీళ్ళని వదలండి. ఇప్పుడు మీ మరుగు దొడ్డి ఎంత శుభ్రపడిందో మీరే చూడండి!

శ్యానిఫ్రెష్ ఎప్పుడు ఎన్నిసార్లు వాడాలి? ఎన్నటికీ వాడుతూండండి— ప్రతి రోజూ!




**మీకు అసహ్యమైన పనిని చేసి, మీ మరుగు దొడ్డిని శుభ్రంగా ఉంచుతుంది!**





# మరో ఇల్లు వద్దు

చియెన్నార్చి...

మధ్యాహ్నమంతా మండి మండి మార్తాండుడు వళ్ళు గుల్లయి గుహాలోకి వెళ్తున్న ఓ ఆదివారం ఐదుగంటల సాయంత్రం వేళ — సుబ్బారావు గృహాన్వేషణ చేస్తున్నాడు

సందులూ— గొందులూ— పేటలూ— పురాలూ—మేడలూ—వాడలు అన్నీ వాకబు చేస్తున్నాడు—చూస్తున్నాడు—

పొద్దున్నించి నిర్విరామంగా అన్వేషణ సాగుతూన్నందున నీరసంగా వుంది— 'మళ్లీ రేపు సోమ్వారం... ఆఫీసులో పొద్దుగడపాలి' కదలలేక మొద్దుబారుతూన్న కాళ్లకి బుద్ధి చెప్తున్నాడు— బద్ధకాన్ని బద్దలు చేస్తున్నాడు—

ఈ వారంలో తను తప్పనిసరిగా ఆ ఇల్లు ఖాళీ చేయాలి. ఏ కాస్త జాగా దొరికినా గభీల్మని దూరెయ్యాలి. 'అసలిలా ఇంటివాళ్ల పిల్లకి పెళ్లవుతే మాత్రం... ఇంకో ఇల్లు చూసుకోమనటం ఏం బావోలేద'నిపించింది. పెళ్లి కెదిగిన వాళ్ల పిల్లమీద— కన్నవాళ్ల అమ్మమీద— ఒప్పుకున్న పెళ్లివారిమీద-- అంత తొందరగా తీసుకొస్తున్న ముహూర్తం మీద—కోపం కొరుకుతున్నాడు, కారాలు నూరుతున్నాడు—

'టు లెట్' ... పరాగ్గా ముందు కడుగు వేసేసి, సరిగ్గా మళ్లీ వెనక్కి చూసాడు. పేడరంగు అట్టమీద సుద్ద ముక్కతో రాసిన... 'టు లెట్' ... దేదీప్య మానంగా మెరుస్తోంది. సూర్యుని కొస మెరుపుల వెలుగులో ప్రత్యేకమైన నైగ నిగ్యం కలిగి 'రోల్డు గోల్డు నగలా' ఆ అట్ట మెరుస్తోంది. సుబ్బారావు కళ్లార్పి చూసాడు. ఆత్మీయంగా అక్షరాల వళ్లంతా కళ్లతో తడి మాడు. రెండు పెదవుల్ని వినియోగించిముద్దుగ పలికాడు—"టూలెట్" ఏ రంగుల హంగులూ లేకపోయినా అది అందిస్తూన్న వెలుగుకి అతగాని కళాహృదయం నివాళి బట్టింది — "ఆలస్యం అమృతంవిషం" — "వెంటనే వెళ్తేనే ఫలం" సంస్కృతంలోనూ—తెలుగు లోనూ హెచ్చరించుకుని పరుగులాంటి నడకతో ఇంటిముందుకు చేరుకున్నాడు—

"ఇల్లు కావాలండి ... ఇక్కడేదోవాటా ఖాళీ ఉందిటగదండీ !" తడబడుతున్నాడు—గుండె దడదడ లాడుతోంది—

"ఎవరు మీరు ? ఇంటి పేరు ??" వత్తులు చేసుకుంటూన్న ఆవిడ ఇటుతిరిగి అడిగింది—ఆవిడే ఇంటావిడ అని తెల్సిపోయింది సుబ్బారావుకి — మాట — మనిషి తెల్లని పుష్టైన శరీరం, తెల్లని అంచు లేని పంచి—గుమ్డాయిలా ఉంది— ముసుగులో గుండూ వుంది. ముమ్మూర్తులా ఇంటావిడ ఆకారాలూ, లక్షణాలు ఉన్నాయి.

"వైదీకులమండి, భమిడిపల్లి వారం" స్పష్టంగా జవాబిచ్చాడు. మొఖం వికసించింది మామ్మగార్కి—

"మా ఇల్లే, ఆ పక్కవాటా..." అని వీధిగది చూపింది—

"ఇన్నాళ్లూ వాగంవారి వీధిలో ఉండే వాళ్లమండి మేం" మరోమాట కలిపాడు.

"ఎందుకని ఖాళీ చేస్తున్నారు ?" శీలపరీక్ష కావన్ను అనుకున్నాడు.

"ఇంటివారమ్మాయికి రేపొచ్చేనెల పదో తారీఖున పెళ్లండి ! అందుకని ఖాళీ చేయాల్సొచ్చిదండి."

"ఎవరెవరుంటారు ? పెళ్లైందా ? పిల్లలెందరూ ?" ప్రశ్నించింది.

"మాకో పాపండి...మళ్లీ మా సరస్వతికి

నాలుగో నెలండి.'' కొంచెం సిగ్గుపడ బోయాడు—

''సరే. ఇల్లు చూస్తావా నాయనా!'' చేస్తూన్న వత్తులూ — పళ్లెం క్రిందపెట్టి సింహద్వారం లోపలికెళ్ళి అద్దికివ్వదల్చుకున్న వీధిగది తలుపు తీసింది.

''లోపలికి రాబాబూ! మంచి నీళ్లు కావాలా?'' గృహస్థ ధర్మం తలుపు తాకగనే గుర్తొచ్చి తీరుతుంది ఎవరికైనాసరే!

''ఇప్పుడే తీసుకున్నానండి!'' చెప్పులు విడిచి కుడికాలు గదిలోపలికి పెట్టాడు.

వీధిగదిలోంచి...మధ్యగదిలోకి...మధ్యగది దాటగానే...చిన్న వంటిల్లు ... అది దాటితే పెరడు. చీకట్లు గదుల అవతలి పచ్చటి దృశ్యం చూస్తుంటే 'ఫిలిప్స్ బాక్స్' గుర్తొచ్చింది సుబ్బారావుకి.

''ఇవీ...నేనిద్దామనుకునేవి!!''

ముందుగది చిన్న డ్రాయింగ్ రూమ్... మధ్యగది వెల్తురుగ్గానీ, గాలిగ్గానీ నోచుకోదు. వంటిల్లు అనే బాత్రూం సైజు చివ్వరి గదికి మాత్రం పెంకుల మధ్యలో అద్దం బిగించారు. దాంట్లోంచి వెలుగు కురుస్తుందికావన్ను. సూర్యుడు జోగుతూన్న సమయం కనక వెల్తురు వెర్రిగానే ఉంది. ఈ తిమిరాంతర గుహాంతరాల అనంతరం పెరట్లో చల్లగా గాలేసింది. పట్నంలో పల్లెగా తోచింది. చుట్టూ కొబ్బరి చెట్లూ, మధ్యలో...కనకాంబరాలూ... పొట్లపాదూ... నుయ్యీ...సొంతూరు గుర్తొచ్చి వళ్లు పులకరించింది సుబ్బారావుకి.

''ఇంక అక్కడ ... ఆ నూతి అవతల లెట్రిన్—బాత్రూం ... మాకూ, అద్దెకున్న వాళ్లకీ కలిపే ఉంటుంది—'' మామ్మగారు గుమ్మానికి మకాం కడుతూన్న సాలీణ్ని ఎడం చెత్తో విసిరేసి...ఇతనికి ఇల్లు ఇవ్వటానికి సింబాలిగ్గా అంగీకరించింది. సుబ్బారావు వాస్తవానికి వచ్చాడు.

''బావుందండి...ఇక్కడ ... గాలి బాగా వేస్తోంది'' అన్నాడు.

ఈ చల్లటివేళ అద్దె గురించి చెప్పాలనిపించింది మామ్మగారికి.

''మొన్నే తొంభై రూపాయలిచ్చి ఎలక్ట్రిసిటీ బిల్లు కల్లటు ఖాళీచేసి ప్రమోషన్‌మీద వెళ్లిపోయాడు. అంతకు ముందరి సబ్ రిజిష్ట్రారూ...రెవెన్యూ ఇనస్పెక్టరూ కూడా అంతేనోయ్ ... ప్ర మో ష న్ మీదే బదిలీ అయారు. నీ ఉద్యోగం ఏదైనా ప్రమోషను ఖాయం'' ఆశ చూపింది మామ్మగారు. 'ఈ ఇల్లు తీసుకుంటే ప్రమోషన్ ఫ్రీ' వ్యాపార రహస్యాన్ని వ్యక్తీకరించింది మామ్మగారు.

''కరెంట్...'' అనిఏదో అడగబోయాడు సుబ్బారావు...

''మామూలే! వాళ్లిచ్చినట్లే బల్బుకి రెండున్నర, ఫేనుకి నాలుగు, రేడియోకి మూడు, ఇస్త్రీపెట్టెకి...''

''మాకు ఇస్త్రీపెట్టె లే దు లెం డి.'' బేరాలకి దిగి కాదనుకొని, ఈ ఇల్లు వదలు నాలుగోనెలండి. ఏడాదివరకూ ఎలానూ ఆ ప్రోబ్లం లేదుకదండీ—అయినా మాకంత...'' ''పట్టింపు లేదసబోయి'' అన చారప్పేసుగలు'' అంటుందేమోనని మింగేసాడు—

''ఇదిగోండి— ఈ ఇరవై ఉంచండి ... బుధవారం పొద్దున్నే వచ్చేస్తామండి'' అని బైటికి బైల్దేరాడు—

''మంచిది బాబూ'' వీధిలోకొచ్చింది ఆవిడ ఆప్యాయంగా సొమ్ములు పట్టుకుని అతని వెనకాలే—

''ఉంటానండి, నమస్కారం.''

''వినయవంతుడే'' అనుకుంది మామ్మ




గారు—వెళ్తూన్న సుబ్బారావు వెనక్కుతిరిగి చటుక్కున ఆగాడు—డైరీతీసి డోర్ నెంబరు నోట్ చేసుకున్నాడు—వీధి పేరు వివరంగా రాసుకున్నాడు—ఆవిడ పేరు వినయంగా అడిగి తెల్సుకున్నాడు— వెనక్కి తి ర గ బో తూ— ''టూలెట్'' బోర్డుకేసి కృతజ్ఞతగా చూసి చేత్తో తీసి ''ఇంక ఇది తీసేద్దామండి'' అని ఇల్లు సొంతం చేసేసుకుని (అద్దెకి తీసేసుకుని అనాలా!) ఆ అట్ట ఆనుకిచ్చేసాడు — ఆవిడ ఆ చురుకుతనానికి ఆశ్చర్యపోతుండగా నిష్క్రమించేసాడు సుబ్బారావు.

పట్టువదలని సూర్యుడు పడమటి గట్టు కోవాలనిపించలేదు మళ్లీ వెతకటం తల్చుకుని భయపడి—

''అలాగేనండి...బుధవారం వచ్చి చేరేస్తామండి'' అన్నాడు.''

''మంచిది నాయనా! ఇదిగో నీ పేరేమిటన్నావు.''

''సుబ్బారావండి.''

''ఆ, చూడు సుబ్బారావూ, వీధిలోకీ — పెరట్లోకీ ఇం క వే రే మార్గంలేదు. బిడ్డాష్టవుతే కూడా ఇలాగే రావాలి. అందుకు అంగీకారమైతేనే ప్రవేశించు.''

''పర్వాలేదండి. అయినా మా ఆవిడకి

# మరో ఇల్లు వద్దు

అంతు తెల్సుకోడానికి తూరుపు తెరలోంచి బైల్దేరుతూనే ఉన్నాడు. సాయంత్రానికి సోలిపోతూ ముఖం ఎర్రగా మాడగా చల్లదనానికై కృష్ణలో దిగుతూనే ఉన్నాడు. సజావుగా రోజులు గడుస్తున్నాయి. విజయవాడ ఎండల్లో రోజులు మాడుతున్నాయి.

సుబ్బారావుకి కొత్తింటి ద్వారాలు అలవాటయాయి. నెత్తికింకేం కొట్టుకోకుండా తలొంచడం అలవర్చుకున్నాడు. ఇల్లుకేం సద్దుకుంటే...చక్కగా సరిపోయింది.సద్దుకుపోతున్నాడు, సరిపోతోందనుకుంటున్నాడు. సరస్వతి కూడా మామ్మగారి ఆత్మీయత నచ్చింది. మామ్మగారికి సరస్వతి ఒద్దికతనం నచ్చింది.

ఈ మధ్యలో సుబ్బారావు 'తల్లి' ఓసారి వచ్చి వెళ్లింది.

బహిష్టవుతే ఈ ఇల్లు బావోదనీ...కోడలికా అవసరం వచ్చేనాటికి ఈ ఇల్లు ఖాళీ చేయమని చెప్పింది. 'ఆచారప్రథమో ధర్మః' హెచ్చరించింది బస్సులోంచి. "ఇల్లు వెతికిచూడు – పెళ్లిచేసిచూడు" సామెత చెప్పింది "అలాగేలే. ఇప్పటికాలంటే...ఎన్ని అవస్థలూ..." సణిగాడు. "అయినా అప్పుడే ఆ అవసరం లేదుగా" నసిగాడు.

మరో వారానికి కూతుర్ని పురిటికి తీసుకెళ్లటానికి సరస్వతి తల్లి వచ్చింది. వస్తూనే ఆ ఇంటికి ఉన్న అవలక్షణం ఆవిడ పసిగట్టేసింది. "బైటుంటే...అన్న..." దవడలు నొక్కుకుంది. ఆ వేళ్లు పళ్లులేని నోట్లోకి బుగ్గల్తో దిగడిపోతున్నాయి. ఆవిడ ఆకారం చూసి... ఆశ్చర్యం చూసి...సుబ్బారావుకి నవ్వొచ్చింది.

"మీ అమ్మాయి పురుడోసుకొచ్చి ... ఆ అవసరం వచ్చేనాటికి ఇంకో ఇల్లు చూస్తాలెండి" అభయం పడేసాడు.

నాలుగు రోజులుండి కూతుర్ని తీసుకెళ్తూ "మళ్లీ అంటున్నాను ... అనుకోకు నాయనా...ఊరగాయలగదీ, దేవుడు గూడూ, పరిశుభ్రంగా ఉండాలి– మిగిలినవి ఎలా తగలడ్డా. ఇంకో ఇల్లు...తొందరేం లేదు. నాలుగునెల్లదాక అమ్మాయిరాదుకదా. వచ్చేసి నాలుగు నెల్లగ్గానీ ఎలాగా..."–సిగ్గేస్తోంది సుబ్బారావుకి. "అలాగేలెండి" పంపించేసాడు.

# తెల్లదనానికి మొదటిది
# ప్రకాశానికి మొదటిది

TATA'S
501
BLUE DETERGENT BAR

# నీలం 501
## డిటర్జెంట్ బార్

"హెచ్చు
ఉతికే శక్తి!
హెచ్చు పొదుపు"



"ముద్ద కాదు, ఎక్కువ
రోజులు వస్తుంది.
పుష్కలమైన నురుగు!"

## మరొక 501 విజేత

CAST-5-253 TL

టాటావారి తయారీ




# మరో ఇల్లు వద్దు

రోజులు గడుస్తున్నాయి. ఉత్తరాలొస్తున్నాయి సరస్వతి నుంచి. తనకింకో పాప పుట్టింది. తనూ బారసాల అవీ అంటే వెళ్ళాడు. ఉంకో రెణ్నెల్లవరకూ పంపనంది అత్తగారు. వచ్చేటప్పుడు 'ఇల్లుమాట'గుర్తు చేసింది.

రోజులు గడుస్తున్నాయి. ఉత్తరాలొస్తున్నాయి సరస్వతి నుంచి. ప్రతి దాంట్లోనూ 'బైటుండేనాటికి సందుండే ఇల్లు చూడమని' రాస్తూ ఉడికిస్తోంది. 'మీరు బైటుంటే వంటింట్లోంచి వెళ్ళకండి' అని ఆట పట్టిస్తోంది.

రోజులు గడుస్తున్నాయి. సరస్వతి సంతానంతో వచ్చింది. దిగబెట్టడానికొచ్చిన అత్తగారు రిక్షా ఎక్కేసి ''ఆ అవసరం వచ్చేనాటికి'' అనుకుంటూ 'వార్నింగ్' మళ్ళీ పడేసింది. సరస్వతి కిసుక్కున నవ్వింది సుబ్బారావుకేసి తిరిగి.

ఓ రెణ్నెళ్ళకి బావమరిది పెళ్ళికెళ్ళారు సుబ్బారావు కుటుంబం. ఆ పెళ్ళవగానే ప్రయాణమవబోతూంటే... సరస్వతి ప్రయాణం వాయిదా పడింది.

''మీరెళ్ళండి. నేను స్నానం అవగానే ఎల్లుండి వచ్చేస్తా'' నవ్వింది.

''అసలిప్పుడే వద్దను. కానీ అక్కడ వంటింట్లోంచే వెళ్ళాలి. ఇంకో ఇల్లు చూడమంటే మాడరూ!'' నవ్వు నొక్కుకొని మాటలు రువ్వలోంది.

సుబ్బారావు ఉడికాడు — అత్తగారు పన్లోంచి అరుస్తోంది...

''ఇదిగో అల్లుడూ ... వచ్చేనెల నాటికైనా...ఇంకో ఇల్లు...'' ఆవిడకు జవాబు చెప్పకుండా సరస్వతి కేసి తిరిగి...''ఎల్లుండొచ్చేయ్.'' తను బైల్దేరి వచ్చేసాడు సుబ్బారావు.

* * *

సరస్వతి వచ్చింది. వస్తూనే నవ్వుతూ ''ఇల్లుసంగతి మర్చిపోద్దంది మా అమ్మ...'' అంది ఉడికిస్తూ. సుబ్బారావు నవ్వుతున్నాడు. భావగర్భితంగా నవ్వుతున్నాడు.

ఆ ధైర్యం చూసి ''ఇల్లు దొరికిందా ... సందు ఉందా...'' అంది కవ్విస్తూ ... తల ఎగరేస్తూ.

''క్వా దొరికింది— పసందు కూడా ఉంటుంది—'' ఉత్సాహంగా జవాబు చెప్పాడు సుబ్బారావు కన్నుకొడుతూ—

* * *

మళ్ళీనెలకి సరస్వతి వాళ్ళమ్మకి కార్డు రాస్తోంది—

మ. స. అమ్మకి నమస్కారాలు! ఇక్కడ మీ అల్లుడుగారూ, చి. పిల్లలూ క్షేమం— నాకీమధ్య వాంతులూ, అన్నం సయించకపోతూంటే డాక్టరుగారికిచూపించుకున్నాను—నువ్వు మరోసారి అమ్మమ్మ అవబోతున్నావు— ఈసారి మనవడు కావాలని ఆశీర్వదించు — మీ అల్లుడుగారు ఏడాది పోయాక తప్పక ఇంకో ఇల్లు చూస్తానని గాయమన్నారు.

ఇట్లు,
సరస్వతి.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

నా సౌందర్యం అంటే ఆయనకు ఎంతో ప్రీతి!
ఆ విషయం ఆయన చెప్పనవసరం లేదు — ఆయన కళ్ళ
లోకి చూస్తేనే చాలు! అలా కలిగే ఆనందానికి హద్దులేదు.
ఆ ఆనందం వలన ఇంటి పనులలో నాకు — కష్టమే కలగదు.
నిజం చెప్పాలంటే నాకు వివాహమయి పది
సంవత్సరాలు పూర్తయిందంటే నమ్మలేరు గదా...కాదా?
ఆ రహస్యం — ఆయనకు, నా సౌందర్యానికి సహాయం
చేస్తోన్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌కి మాత్రమే తెలుసు.

**Pond's**




పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్
మీరు కూడా సౌందర్యంతో శోభించండి.

PIL.1840 R

కె. యస్. ఆర్. — దువ్వూరు

నాకు మోటారు సైకిల్ ఏక్సిడెంట్‌లో ఎడమ చేయి భుజమునకు బెత్తెడు దూరములో ఎముక విరిగినది. పుత్తూరుకట్టు కొద్ది రోజులు కట్టించినాను. తరువాత నెల్లూరులో కట్టు కట్టించినాను. ఇప్పుడు అతుక్కున్నదని కట్టు విప్పేసినారు. కాని చెయ్యి పైకి ఎత్తలేకుండా వున్నాను. నివారణోపాయం తెల్పండి?

* క్లావికిల్ అనే ఎముక విరిగిన కొన్ని నెలల వరకూ చెయ్యి మామూలుగా పైకి ఎత్తటానికి రాదు. కొద్ది కొద్దిగా చేయి పైకి ఎత్తి పట్టుకొంటూ ప్రతిరోజూ కొంచెంసేపైనా వ్యాయామం చేయవలసి ఉంటుంది. దాదాపు మూడు, నాలుగు నెలలు అలా చేసిన తర్వాత మాత్రమే చెయ్యికొద్దిగా స్వాధీనానికి వస్తుంది.

టి. ఎన్. కె. — పలాస

ఆడవారిలో 'గొనేరియా' రోగం ఎలా వస్తుంది? ఈ రోగం వచ్చిందని తెలుసు



కోవటం ఎలా? ఇది వస్తే దీనికి ఏ ఏ మందులు వాడాలి?

* "గొనోరియా" రోగం ఉన్న మగవారితో సంభోగించినప్పుడు స్త్రీలకి ఈ రోగం రావటం జరుగుతుంది. ఈ రోగం వచ్చినవారికి జననేంద్రియంలో మంట, తెల్లగా చీమువంటి పదార్థం మూత్రనాళం నుంచి కారటం, దురద మొదలయిన లక్షణాలు ఉంటాయి. ఆ భాగంలోనించి వచ్చే చీము వంటి పదార్థాన్ని మైక్రోస్కోప్‌తో పరిశీలించి చూస్తే రోగ నిర్ధారణ అవుతుంది.

ఈ రోగానికి వైద్యుల సలహా ప్రకారం "లాంగ్ వర్కింగ్ పెన్సిలిన్" వాడవలసి ఉంటుంది. పెన్సిలిన్ శరీరానికి పడనివారికి టెట్రాసైక్లిన్ వంటి మందులు వాడవచ్చును.

కె. ఎస్. — తెనాలి.

నాకు పిరియడ్స్ అయిన 10 వ రోజు నుంచి 16 రోజుల వరకు, మరలా 5, 6 రోజులలో పిరియడ్స్ వస్తాయనగా 'వైట్ డిస్చార్జి' అవుతుంది. ఇది పెద్ద జబ్బేమోనని అనుమానంగా వున్నది. నాకు పెండ్లయి 3 సంవత్సరములు అయినది. పిల్లలు ఇంకా కలుగ లేదు. డి అండ్ సి చేయించుకున్నాను. ఏమీ లోపంలేదన్నారు. ఈ 'వైట్ డిశ్చార్జి' అయితే పిల్లలు పుట్టరా?

* వైట్ డిశ్చార్జి అవటానికీ, పిల్లలు పుట్టకపోవటానికి పెద్దగా సంబంధం లేదు. మీ వారిని "సెమెన్ అనాలిసిస్" చేయించుకోమనండి. ఆ టెస్ట్‌లో ఫలితం సరిగా ఉన్నట్లయితే మీరు లేడీ డాక్టర్లవద్ద మిగతా పరీక్షలు చేయించుకోవటం మంచిది.

— డా॥ కె. వెంకటేశ్వరరావు

---

# మేడ వేసిచూడు

(18 వ పేజీ తరువాయి)

చెప్పడంలేదు. కాని ఉత్త ముందువేపు దానితో కడుపెక్కడ నిండుతుంది, నా మొహం!" అన్నాడు శేషగిరి, తన హాస్యానికి తనే మురిసిపోతూ. శకుంతల పెడముఖం పెట్టింది. శకుంతల అటువేపు తిరిగి నవ్వుకుంటోందని శేషగిరి తప్పంచనా వేసి,

"నేను వచ్చి ఇంతసేపైనా కాఫీనీళ్ళివ్వలేదు. టిఫిన్ పెట్టలేదు. ఎందుకు చెప్మా! అనుకొన్నాను. అర్థమైంది. గడ్డితిన్నమ్మకి మొగుడాకలి తెలియదనికదా పెద్దలు నుడువుదురు" అని పుంజుకొన్నాడు.

"సిగ్గు లేకపోతే సరి" అంది శకుంతల టపీమని. ఇటువంటి మాటలు పెళ్ళయి పదేళ్ళు గడిచి పదకొండో సంవత్సరం అడుగు పెడ్తూనే అనడం మొదలు పెట్టింది. శేషగిరి శకుంతల మాటల్ని పట్టించుకోడం మానేయటం మొదలు పెట్టింది కూడా అప్పుడే.

"పెద్దలకా?" అన్నాడు శేషగిరి.

"సంతోషిస్తున్నారు" అంది శకుంతల.

"పొన్లే అదే బెన్ ఫిట్ ఆఫ్ డౌట్. ఇంతసేపు ఏడుస్తున్నావు అనుకొని బెంగపడి పోతున్నాను."

శకుంతల కోపం ఒక్కసారి అగ్నిపర్వతంలా బద్దలయింది.

"మీకు ఇదే బెన్ ఫిట్ ఆఫ్ డౌట్! అవును మరి. నిజంగా బెన్ ఫిట్ ఆఫ్ డౌట్ ఎప్పుడైనా కళ్ళ చూస్తే కదా! లేనప్పుడేం చేస్తాం. ప్రతిదాన్ని చూసే ఇదే బెన్ ఫిట్ ఆఫ్ డౌట్ అనే బెనిఫిట్ ఆఫ్ డౌట్ అంటూ ఉంటాము మతి భ్రమించిన వాళ్ళలాగా."

"ఎంతమాటన్నావ్! ఎంత మాట విన్నాను!"

"మరో అంతమాట అంటున్నాను, ఇది కూడా వినండి. మరో ఏడాది లోపల నాచేత నిర్వాకం చేయించండి. దానికి పునాది రెండు మూడ్రోజుల్లో వేయండి. అత్తగారి ముందు, అమ్మమ్మగారి ముందు నేను తలెత్తుకొని తిరిగేలా చెయ్యండి. ఆ పునాది పడేవరకు ఈ వంచిన తలెత్తుకొని తిరగను" అంటూ శకుంతల భీషణ ప్రతిజ్ఞ పట్టింది. ఆ తరువాత శకుంతల వంచిన తలతో తిరగటం మొదలు పెట్టింది.

శాంతమ్మ "జలుబుకి మెడ బెణికిందేమిటే శకుంతలా! కాస్త మిరియాల కషాయం పెట్టనా" అని అడిగింది కూడాను.

శారదమ్మ "ఏమైందమ్మా ఏ మెడకి" అని అడిగింది.

శకుంతల ఇద్దరికి ఒకటే సమాధానం చెప్పింది—

"మా ఆయన చేయించిన నగల బరువుకి నా మెడ వంగిపోయింది" అని.

శకుంతల దేనికో శేషగిరి మీద యుద్ధం ప్రకటించిందన్న విషయం ఇంట్లో వాళ్లందరికి అర్థమై పోయింది. శేషగిరితో తల్లి "ఒరేయ్ శేషుడూ! శకుంతల మనస్సు ఎందుకో బాధ పడ్తోంది. కాస్త బుజ్జగించి కనుక్కో" అంది.

తండ్రి సుబ్బారావు "ఏదన్నా కావాలంటే చేసిపెట్టు" అని శేషగిరిని శాసించాడు.

నాయనమ్మ శాంతమ్మ "అది మిరియాల కషాయం కూడా వద్దంది. దాని మనస్సు చాలా నొచ్చుకొన్నట్టుంది" అంది. శాంతమ్మ బెల్లం వేసి మిరియాల కషాయం చాలా రుచిగా పెడ్తుంది. శకుంతలకి చీటికి మాటికి జలుబు చేస్తుంది. శాంతమ్మని అడిగి కషాయం పెట్టించుకొని తాగుతుంది. శకుంతల జీవితంలో మిరియాల కషాయం ఓ తియ్యని బాధ.

"నాన్నగారు! అమ్మ మమ్మల్ని ఊరికే కోప్పడ్తోంది" అని కంప్లెయింట్ చేసారు పిల్లలు శారద, పద్మ.

ఇంట్లో అందరిచేత ఆ విధంగా చెప్పించుకొన్న శేషగిరి ఆ రాత్రి శకుంతల్ని దగ్గరకి తీసుకొని "నా బుజ్జివి కదమ్మా! నాకు బోలుడు కాకపోయినా కనీసం ఒక మిద్దో ఒక మేడో కట్టించాలని ఉంది. కాని శక్తి లేదు. చేతకాక ఊరుకొన్నాను" అని నవ్వుచెప్పబోయాడు.

"మీరే డిపార్ట్‌మెంటులో రీడరు?" అని శకుంతల అమాయకంగా వినిపించే ప్రశ్న వేసింది.

"సివిలింజినీరింగ్‌లో."

"మీరు కుర్రాళ్ళ కేమేమి సబ్జెక్ట్స్ చెప్తారు?"

శేషగిరికి ప్రశ్నకి జవాబు కంఠతా వచ్చు. యు.జి.సి.కి మూడుసార్లు, సి.ఎస్.ఐ.ఆర్.కి రెండుసార్లు, నేషనల్ డైరక్టరికి ఒకసారి, సెనేట్ కోసారి, ఎకడమిక్ కౌన్సిల్ కోసారి యూనివర్సిటీ ఆన్యువల్ రిపోర్టుకోసారి, సిండికేట్‌కోసారి, చొప్పున ఏడాదికి ఓ పదిహేనుసార్లు రకరకాల ప్రొఫార్మాల్లో ఈ ఇన్

## మేడ వేసిచూడు

ఫర్మేషనే ఇస్తూ ఉంటాడు. ఇన్ని పదిహేనుసార్లు ఇవ్వటం విసుగువచ్చి,

"మొన్ననే కదా ఇచ్చాం. అదే వాడండి" అని ఎవరన్నా అంటే,

"బావుంది. పాతవాళ్ళు కొంతమంది వెళ్ళిపోయి ఉంటారు. కొత్తవాళ్ళెవరో వస్తుంటారు. ఎవరెవ రెక్కడున్నారో మాకేం తెలుసు. అందుకే అదే ఇన్‌ఫర్‌మేషన్ మరోసారి ఇవ్వండి" అంటారు అధికారులు.

"హైడ్రాలిక్స్, ఇరిగేషన్, అప్లయిడ్ మెకానిక్స్, సర్వేయింగ్ బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ మరియు డ్రాయింగ్."

"వివరివి మరోసారి చెప్పండి"

శేషగిరి గొంతులో [illegible] "ఇళ్ళు కట్టటం [illegible] గయుటు." ఒకసారి తెలుగులో చెప్పాడు శకుంతల కర్థమయ్యేలా.

"ఈ పాఠాలు ఎప్పు చెప్తున్నారా? [illegible]యుకుంటున్నారా?"

"ఎంత మాటన్నావు? మా ప్రిన్సిపాల్ కూడా ఎప్పుడూ అనలేదు."

"అంటే మీకు ఇళ్ళు కట్టడం తెలుసు అని మీరే ఒప్పుకొంటున్నారన్న మాట. మరి ఎందుకు కట్టరు? నా ముచ్చటెందుకు తీర్చరు?"

"ఇళ్ళు కట్టించడం నాకు కరతలామలకం. కాకపోతే పుస్తకామలకం."

"కరతలామలకం అంటే ఏమిటండీ?" శకుంతల శేషగిరి వేపు తిరిగి అడిగింది.

"తలకి చుట్టుకొన్న రోకలి."

"ఏదో సరదాగా అడిగితే విసుక్కుంటారేం."

"ఏ సరదాలంటే నాకు విసుగులేదు. ఇప్పుడు నిద్ర మాత్రమే ఉంది."

"అయితే ఓ ఇల్లు కట్టుకొందామా?" లేచి కూర్చుని శకుంతల ఉత్సాహంగా అడిగింది.

"నీకు సరదా, నాకు నేర్పు ఉన్నాయి అంటావు."

"అవును."

"అవి చాలవు చిట్టీ!"

"ఇంకా ఏం కావాలి? కావాలంటే మీరు కట్టిస్తున్నంతసేపు ఆరెంజి బోర్డరు ఆకుపచ్చ చీర కట్టుకొని మీ ఎదురుగుండా మీకు నచ్చేలా మీరు మెచ్చేలా కూర్చుంటాను."

"అది చాలదు చిట్టీ. అన్నిటికీ మించినది మరోటి ఉంది. అది కావాలి."

"మీకు నా అందాన్ని మించినది మరోటి కావాలా?" శకుంతలకి మళ్లీ సమపాళ్ళల్లో కోపం, ఏడుపు వచ్చేసాయి.

"అబ్బబ్బ శకూ! లౌకికమైన విషయాల్లో కూడా నీ అందం, చీరల ప్రసక్తి తెస్తే ఎల్లా? ప్రపంచంలో ఓ పాపిష్టిది ఉంది. అది చాలా పుణ్యాత్ములమూ, కొద్దిగా మాత్రమే పాపిష్ఠులము అయిన మనదగ్గర, బొత్తిగా కొద్దిగా ఉంది. దాన్ని డబ్బు అంటారు."

"ఎల్లైసీ వాళ్లనే చాలా పాపాత్ములున్నారటగా! నాళ్లు మనలాంటి వారికి అప్పులిచ్చి పాప భారం తగ్గించుకొంటారుట కదా!"

శకుంతల తను అనుకొన్నంత అమాయకురాలు కాదు. చాలా భోగట్టా సంపాదించింది. ఇంటి విషయంలో ఇదేదో గట్టి పట్టుదలలాగానే ఉంది; అనుకొన్నాడు శేషగిరి.

శేషగిరిలో చిన్న అనుమానపు మెరుపు మెరిసింది.

"ఎవరు చెప్పారు?"

"చలపతి అన్నయ్యగారు!" శకుంతల శేషగిరి అనుమానాన్ని ధృవపరిచింది.

తనకు చిన్నప్పటి నుంచి స్నేహితుడు ప్రస్తుతం సహోద్యోగి, ఒకేవీధి వాస్తవ్యుడు అయిన చలం ఎలియాస్ చలపతి తనకి ద్రోహం తలపెట్టాడన్నమాట. ఈ చలపతి గాడిన్నాళ్లుగా ఏ సినిమాహాల్లో ఏ చెత్త చిత్రరాజం ఆడ్తోందో, ఏ షాపులో అమ్ముడుపోని చీరలు చవకగా అమ్ముతున్నారో మాత్రమే శకుంతల చెవిలో ఊదుతూ ఉన్నాడు. ఇప్పుడు ఎల్లైసీలు, లోన్లు, స్థలాలు ఇళ్లు అంటున్నాడన్నమాట. వాడి పెళ్లాం కనకమహాలక్ష్మికేమధ్య పుట్టింటి ఆస్తి జరిసింది. దాంతో సీతమ్మ ధార దగ్గర చిన్న జాగా కొన్నాడు. అదంతా తన ప్రయోజక్షమే తనే చిన్న భూమి కధి నాధుడనని విర్రవీగుతున్నాడన్నమాట, వెధవ ... అనుకొన్నాడు శేషగిరి మనస్సులో.

బయటికి మాత్రం— "అన్నయ్యగారింకా నీకేం చెప్పారు శకుంతలా? సీతమ్మధార దగ్గర స్థలాల ఖరీదులు చెప్పారా? ఎంతలో ఉన్నాయిట? చవగ్గా గాని మనకిప్పించగలరా?" అని తెలుసుకోగోరిన వారు అడిగే అంత శ్రద్ధగా అడిగాడు.

"అడగటం మర్చిపోయానండి" అంది శకుంతల నాలిక్కర్చుకుంటూ.

"గజం పాతికకి తక్కువుండదు. ఆరు వందల గజాలన్నా లేకపోతే మనకి చాలదు. స్థలం కొనడానికి పదిహేనువేలు కావాలి. అంటే సెకెండ్ హేండ్ ఫియట్ కారు ఖరీదంత. పైగా రోజు రోజుకి ఖరీదులు పెరిగిపోతున్నాయి."

"కారు ఖరీదులు పెరిగిపోతుంటే మనకేమండీ. మనకో కారుంది కదా!"

"నేను చెప్తున్నది స్థలాల ఖరీదులు."

"సరిగ్గా చెప్పరేం మరి. తొందరగా స్థలం కొందాం, అయితే."

"దేంతో?"

"డబ్బుతో." శేషగిరి తన దగ్గర లేదన్నాడు.

"అప్పు చెయ్యండి!" శకుంతల సలహా ఇచ్చింది.

"ఎక్కడ?"

"ఎల్లైసీలో."

"వాళ్ళు స్థలం కొనటానికి అప్పు లివ్వరు. ఇళ్ళు కట్టడానికి మాత్రమే ఇస్తారు."

"మరి చలపతన్నయ్యగారు ఇల్లు కట్టుకోడానికి ఎల్లైసీ అన్ని విధాలా సహాయం చేస్తుందని చెప్పారేం?" శకుంతల ఆశ్చర్యంగా అడిగింది.

"వాడు ఎల్లైసీ గురించి ఎన్నయినా లెక్చర్ చెప్తాడు. కనక మహాలక్ష్మి పేర్న ఏజన్సీ తీసుకొన్నాడు. మనలాంటివారి చేత పాలసీలు కట్టించి, కంపెనీ దగ్గర తన కమిషన్ తీసుకొంటాడు."

"పాలసీ ఏమిటి మధ్యలో?"

"మనచేత ఏ లక్షకో మన జీవితాన్ని భీమా చేయించి పాలసీలమీద మనకు డెబ్బై వేలో ఎనభై వేలో అప్పు ఇప్పిస్తాడు. ఆ పాలసీ ప్రీమియమ్నూ కట్టుకోవాలి. అప్పూ తీర్చుకోవాలి."

"అదొద్దులెండి. అన్నయ్యగారు స్థలమెల్లా కొన్నారో! యూనివర్సిటీవాళ్లిచ్చే జీతాల్తో అయుండదు."

"నాకు తెల్సు ఎల్లా కొన్నాడో! ఆ పద్ధతిలో కొనడానికి నా కభ్యంతరం లేదు. పైగా చాలా ఇష్టం కూడాను."

"అయితే కొనెయ్యండి ఆలస్యం చెయ్యకుండా."

"నా పెట్టెలో రెండు బట్టలు సర్దు బయల్దేరుతాను."

"హైదరాబాదుకా?"



# మేడ వేసిచూడు

"కాదు. తణుక్కు."

"మధ్యలో తణుకెందుకు ?"

"అక్కడేకదా మీ తమ్ముడు సారధి ఉంది."

"వాడితో మీకేం పని ?" ఈసారి శకుంతల అనుమానంగా అడిగింది.

"అడిగావు గనక చెప్తున్నాను. మీ చలపతి అన్నయ్య ఉన్నాడే ఆ వెధవకి సిగ్గెక్కువ. అందుకని నీతో చెప్పకోలేదు. మొన్న కనకమహాలక్ష్మి బామ్మ పోతూ కనక మహాలక్ష్మికి పదివేలు రాసి పోయింది. అంతకు ముందు పుచ్చుకొన్న కట్నం డబ్బులు ఇవీ కలిపి వాడు కనకమహాలక్ష్మికి స్థలంకొన్నాడు. మీ బామ్మ పోయినప్పుడు అంత ఆస్తి సారధి తీసుకొన్నాడు. అందులో నీకు రావల్సిన భాగం అడిగి తీసుకొంటాను. పైగా మన పెళ్లికి మీ నాన్నగారు కట్నం ఇవ్వటం మర్చిపోయారు. అది అడిగి తీసుకొందామంటే ఆయన పోయారు. కనక దాని విషయం సారధితోనే మాట్లాడాలి" అని శేషగిరి విశదంగా తెలియబర్చాడు.

"సంతోషించాం తెలివితేటలకి. హాస్యం అన్నింటికి."

"నువ్వు అన్నింటికి సంతోషిస్తావు. అదే టెన్ ధవుజెండ్స్."

"బందరు బడాయిలు పోనిచ్చుకొన్నారు కాదు" అంది మూతి తిప్పతూ శకుంతల.

"ఆ లడాయికి దిగటం, పూర్తిగా మీ గుంటూరు బామ్మ పోలిక. ఆ మూతి తిప్పడంతో సహా."

"మా బామ్మ జోలి మీకెందుకు ?" అని శకుంతల కోపగించుకొని దుప్పట్లోకి దూరి పోయింది.

మర్నాడు పౌర్ణమి. రాత్రి భోజనాలయ్యాక శేషగిరి, "త మ ల పా కు లు, వక్కపొడి తీసుకురా!" అని శకుంతలతో చెప్పి తను చాప దిండు తీసుకొని డాబా మీదకు వెళ్లాడు. శేషగిరి చాలా పెద్ద ప్లానులో ఉన్నాడు.

శకుంతల తమలపాకుల పళ్లెం తీసుకొని మెల్లిగా తల వంచుకొని మెట్లెక్కి వచ్చింది. చందమామ చల్లగాను, అందంగాను ప్రకాశిస్తున్నాడు. శేషగిరి పక్కనే, బాపు సినిమాలో సంగీతలా కూర్చుంది శకుంతల.

"తల వంచుకొని కూర్చుంటే శోభనపు పెళ్లికూతుర్లా ఉన్నావు" అన్నాడు శేషగిరి.

శకుంతల, ముళ్లపూడి డైలాగులా చిరునవ్వు నవ్వింది. "లా హి రి లా హి రి పాడ్దామా ?" అని ఉత్సాహంగా అడిగాడు శేషగిరి. మామూలుగా అయితే శకుంతల హడిలిపోయి, "వద్దమ్మా! మీరు కబుర్లు చెప్పండి. మీ వళ్లో నేను తల పెట్టుకొని వింటూ ఉంటాను. లేకపోతే నా వళ్లో మీరు తల పెట్టుకొని పడుక్కోండి. నేను పాడ్తాను." అంటూ శేషగిరి పాట తప్పించేస్తుంది. అల్లాంటిదారోజు శకుంతల వంచిన తల వంచినట్టే ఊపి రాగాలాపన మొదలు పెట్టింది. శకుంతల కూడా పెద్ద ప్లానులో వచ్చింది!

శేషగిరికి క్షణకాలం అనుమానం వేసింది, ఈ ధోరణిలో శకుంతల గెలవవచ్చునని. అందుకని ముఖం మీద గంభీరత పులుముకొని శేషగిరి "శకూ! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలను కొంటున్నాను" అన్నాడు.

"ఇలాంటప్పుడు ముఖ్యవిషయాలు కాదు మాట్లాడాల్సింది, ముఖం విషయాలు మాత్రమే మాట్లాడాలి. నీ మొహం చంద్రబింబం అనో మరో అల్లాంటిదో అనాలి" అనేది మామూలుగా అయితే శకుంతల. కాని ఆ చరిత్ర సృష్టించబడుతున్న రోజున "చెప్పండి" అంది, కలువకన్నులతో శేషగిరిని చూస్తూ.

ఆ కళ్లల్లో తన బొమ్మ చూసుకొన్న శేషగిరి పోనీ ఈ విషయం మరో రోజుకి వాయిదా వేద్దామా అనుకున్నాడు. కాని తను ప్రజ్ఞానిధి. తను ధ్యేయం నుండి మరల రాడు!

"అదే మనం కట్టబోయే ఇంటి సంగతి. అది ఎంత సైజుదిట ?" అని అడిగాడు.

"ఈ యిల్లంత ?"

"అరిపోతాం పూర్తిగా."

"పోనీ సగం అరుదాం."

"అంటే వెయ్యి చదరపు అడుగుల ఇల్లన్నమాట."

"అంటే చిన్నదా ?"

"కాదు. పెద్ద పెద్ద ఆఫీసర్లకి కూడా అంత ఇళ్లుండవు."

"ఎందుకని ?"

"పెద్ద ఆఫీసర్లు ఢిల్లీ, బొంబాయి

లాంటి పెద్ద ఊళ్లల్లో ఉంటారు. అక్కడ అద్దె లెక్కువ.''

''మనం ఢిల్లీలో ఉద్యోగం చేస్తే మన కామాత్రం ఇళ్లిస్తారా?''

''ఇవ్వరు. నేనంత పెద్ద ఆఫీసర్ని కాలేను.''

''పోన్లెండి. బాధపడకండి. అందరు పల్లకి ఎక్కితే మోసేదెవరు?'' శకుంతల సానుభూతి చూపించింది. శేషగిరికి వళ్లు మండింది.

''నీ మొగుడు పల్లకీ మోయాల్సినంత చిన్న ఉద్యోగి కూడా కాదు.''

''పోన్లెండి. పెళ్లి ఊరేగింపులో పల్లకీ పక్కన ఊరేగింపుగా నడిచే మనుష్యులలాంటి వాళ్ళం! అయినా మనం పెద్ద నగరంలో లేము కదా! అందుకని మనం ఆ మాత్రం ఇల్లు కట్టుకోవచ్చు.''

''టూపేరం ఓ పన్నెండడుగుల ఎత్తు పెడ్దామా?''

''ఆ మాత్రం ఉండకపోతే వేసంకాలం ఉండలేము.''

''ఒక ఘనపు అడుగు లివింగ్ స్పేస్‌కి విశాఖ పట్నంలో నలభై అయిదు రూపాయల రేటుంది. మనం కట్టబోయే ఇల్లు పన్నెండు వేల ఘనపు అడుగులు.''

''మన ఇల్లే కాకుండా, దాని అడుగులు కూడా ఘనమేనన్న మాట'' శకుంతల అన్నీ ఘనంగా ఉండటం ఇష్టం. శేషగిరి ముఖం చిట్లించి,

''ఎంతవుతుందో తెల్సా అంత ఇంటికి.'' అని ప్రశ్నించాడు.

''ఘనంగానే అవుతుంది'' అంది శకుంతల లెక్క కట్టబోయి కుదరక.

''యాభై నాలుగు వేలు'' శేషగిరి చెప్పాడు.

''యాభై వేలు చేసుకోండి'' శకుంతల బేరం పెట్టింది.

''కుదరదు.''

''మీకంటే మనకి కూరలమ్మేవాళ్లు నయం. చూడండి, ఆ అమ్మాయిలు నయం. నేనడిగ్గానే అంతో ఇంతో తగ్గిస్తారు. మీరు మాత్రం తగ్గించరు. ఊళ్ళోవాళ్ళకైతే నలభై వేలని చెప్తారు. నేనడిగేసరికి ఎక్కడలేని బిగింపు వచ్చేస్తుంది.'' శకుంతల ముక్కు ఎగబీల్చ సాగింది.

(ఇంకా వుంది)

# హైదరాబాద్ నోట్‌బుక్

(15వ పేజీ తరువాయి)

**ఫోటో స్టూడియోలు బంద్ :**

జంట నగరాలలోని 450ఫోటో స్టూడియోలు, దుకాణాలతో సహా రాష్ట్రంలోని ఫోటో స్టూడియోలు ఆగస్టు 6న బంద్ పాటించాయి. హిందుస్థాన్ ఫోటో ఫిల్మ్‌స్ కంపెనీ రోల్ ఫిలిం ధరను హెచ్చించినందుకు నిరసనగా ఈ బంద్ జరిగింది. పిదప రాష్ట్ర ఫోటో గ్రాఫర్ల సంక్షేమ సంఘం సభ్యులు శ్రీ బి. రామస్వామి (భాగ్యనగర్ సినీ స్టూడియోస్)అధ్యక్షతనసమావేశమై ఫోటోగ్రాఫిక్ వృత్తిలోనున్నవారు ఎదుర్కొంటున్న సమస్యలను చర్చించారు. ఫిల్ముల ధరలు తగ్గేవరకు పోరాడాలని తీర్మానించారు. ఈ కోరికలను తెలిపే విజ్ఞప్తి పత్రాన్ని హిందుస్థాన్‌ఫోటో ఫిలిమ్స్ కంపెనీ హైదరాబాద్ శాఖ మేనేజరుకు అందజేశారు. సంక్షేమ సంఘం అధ్యక్షుడు శ్రీ వి. కోటేశ్వరరావు, సభ్యులు శ్రీ నాగేంద్ర, శ్రీ దేవనాథ ఆర్య మున్నగువారు ప్రసంగించారు.

**మతం—మతోన్మాదం :**

ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఆగస్టు 9న, మక్కా మసీదులో ఇస్లాం గ్రంథాలయాన్ని ప్రారంభిస్తూ మతానికి, మతోన్మాదానికీ చాల వ్యత్యాసముందన్నారు. ఏ మతాన్నయినా చిత్త శుద్ధిలో అనుసరించే వారు ఎన్నటికీ మతోన్మాదులు కాలేరని అన్నారు. తనకు దేవాలయాలను, మసీదులను దర్శించే భాగ్యం కలిగిందని, ఎక్కడికి వెళ్లినా భగవత్స్వరూపమే సాక్షాత్కరిస్తుందని ఆయన అన్నారు. దేవాలయాలు,మసీదులు, చర్చిలు, తదితర ప్రార్థనా స్థలాలు మనుష్యులలో ఎప్పటికప్పుడు నవ చైతన్యాన్ని, స్ఫూర్తిని వెల్లి విరియ జేస్తాయని ఆయన అన్నారు. ఆయన మత కలహాలను ఖండిస్తూ, మత కలహాలను రెచ్చగొట్టే శక్తులు నేడు నీరసించాయని అన్నారు. వక్ఫ్ నిధులనుసక్రమంగా వినియోగించాలని, శిథిలావస్థలో ఉన్న దేవాలయాలను పునరుద్ధరించడానికి హిందూ దేవాలయాల చట్టంలో అవకాశం ఉందని, వక్ఫ్ చట్టంలోని అవకాశం కల్పించాలని ఆయన సూచించారు. ప్రారంభంలో మక్కా మసీదు నిర్వాహక సంఘాధ్యక్షుడు మీర్ అక్బర్ అలీఖాన్ స్వాగతం చెప్పారు. ఈ గ్రంథాలయ నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వం అయిదు లక్షల రూపాయలు యిచ్చింది.

**ఫోన్ రసికుని అరెస్టు :**

ఇంట్లో పెద్దలందరూ పనులమీద వెళ్ళిపోగానే పిదప ఫోను మోగుతుంది. ఇంట్లో ఉన్న వయసు పిల్లలు రిసీవరు ఎత్తుతారు. అవతలినుండి రకరకాల ప్రేమగీతాలు, మధురాలాపాలు వినిపిస్తాయి. కుశల ప్రశ్నలు, సంకేతాలు ఒకటేమిటి? ప్రబంధ ధోరణంతా వెల్లి విరుస్తుంది. ఇది దాదాపు ప్రతి ఇంట్లోను జరిగే సంగతి. ఎవరో, ఏమిటో ఎలా పట్టుకోడం? ఇలాటి ఘనుడొకడు, నగరంలోని పేరు మోసిన ఒక హోటలులో రిసెప్షనిస్టుగా పని చేస్తూ, టెలిఫోన్ శృంగారం ప్రారంభించాడు. ఇలా చాలా మందితో సరసాలాడాడు. అతనిని కాచిగూడ పోలీస్ స్టేషన్ ఇన్‌స్పెక్టరు శ్రీ ఎల్. ఎన్. రెడ్డి నాయకత్వాన సబిన్‌స్పెక్టర్ శ్రీ విద్యాసాగర్ ఆగస్టు 13న అరెస్టు చేసి, కోర్టులో హాజరు చేయగా,దండనాథుడు అతనికి జుర్మానా విధించాడు.

**ఉపశ్రుతి :**

మీరు ఇచ్చిన పారితోషికం ఒక 'బీర'కాయకు సరిపోతుంది అన్నారు పాత్రికేయుడు శ్రీ జి. కృష్ణ పరిహాసంగా. అవునౌను. ఎంత కాయకు[illegible]! అన్నారు ఆకాశవాణి ఉద్యోగి శ్రీ పాతాళభేది గోపాల కృష్ణ ఛలోక్తిగా.

—తిరుమల రామచంద్ర



# వారఫలం

## 19-9-1980 శుక్రవారం మొదలు 25 9-1980 గురువారం వరకు

మేషం:— స్థిమితంగా ఉండాలంటే వీలు లేకుండే పరిస్థితి. అడుగడుగునా వ్యాపారంలో యిబ్బందులు తటస్థించగలవు. ఏమయినా రాశికి ఆరింట గల 'శని' స్థితి, గురు స్థితిలు ఉత్తమ ఫలదాయకాలే. ద్రవ్యాదాయానికి అనుకూలం. ఒప్పుకున్న బాధ్యతలను కళారంగంలో అభివృద్ధి పొందే వారమే. మరేమి యిబ్బంది లేదు. స్త్రీలకు: విద్యా వైజ్ఞానిక, సాంఘిక, ఆర్థిక రంగాల్లో అనుకూలత గలదు.

వృషభం:— అవయవాల్లో రుగ్మత, తట స్థించటం, ఒక వేళ వాహన ప్రమాదం సంభ వించటమో, చెప్పదగిన వారం. దాయాదులతో ఘర్షణ సంభవం. బంధువులతో వినోద కాల క్షేపం, విందు భోజనాలతో కాలక్షేపం చేయుటం సంభవం. వృత్తి వ్యాపారాలు సులువుగా సాగి పోయే వారం. ఆదాయముంటుంది. స్త్రీలకు: ఉన్నతోద్యోగం కొరకు ప్రాకులాడే వారికి అనుకూల వారం.

మిధునం:— మీ బంధువులు, ముఖ్యంగా భార్యవైపు వారు, ఎలాగైనా మీ దగ్గర కొంత లాభం పొందాలని ప్రయత్నిస్తారు. ధనం గుంజా లని ఆలోచిస్తారు. మీ చేత భారీ వ్యాపారానికి పెట్టుబడి పెట్టించాలని ప్రయత్నిస్తారు. జాగ్రత్తగా ఉండండి. స్త్రీలకు: శుభ కార్య ప్రసంగాలు, క్రీడారంగంలో పోరవకు అవకాశం గలవారం.

కర్కాటకం:— బాధ్యతలు సక్రమంగా, సమగ్రంగా నెరవేర్చ గలుగుతారు. ఉపాధ్యాయులకు, పత్రికా ప్రకటన కర్తలకు, గ్రంథ విక్రేతలకు, చలనచిత్ర రంగానుభవం గల వారికి లాభదాయక వారం. దగ్గరి బంధువుల గూర్చి ఆందోళనచెంద వలసిన అవసరమున్నది. ఆస్తి సంపాదించనున్నారు. స్త్రీలకు: గృహాలంకరణతో, చాలమందికి శుభ కార్యాలోచనలతో వారం గడుస్తుంది.

సింహం:— వారారంభం, ప్రశాంతంగా, ధన లబ్ధితో, ఒక వేళ పాత బాకీలు వసూలు కావటంతో గడుస్తుంది. మేలైన దుస్తులు, నగలు కొనే ప్రయత్నం చేయబోతారు. శుక్రవారం చాల చికాకుగా ఉండవచ్చు. ప్రయాణంలో అనాను కూలత, గాయాలు తగులుట మున్నగు స్వల్ప ప్రమాదం సంభవం. స్త్రీలకు: వయసుమీరిన బంధు వర్గీయుల మూలాన ఆస్తి సంక్రమింప గలదనే శుభవార్త వింటారు. చాలమందికి ఆదాయమున్నది.

కన్య:— చాల ప్రశాంతంగా, ఓర్పుతో, నిబ్బరంతో ఉండాలిసిన వారమే. చాలమందిమిమ్మ లను పెడత్రోవ పట్టించాలని ప్రయత్నిస్తారు. హుషారుగా ఉండాలి. తొందరపాటు తగదు. ఉద్యోగంలో పొరపాటు జరుగకుండా చూచుకో వాలి. స్త్రీలకు: క్రీడారంగంలో, గృహాలంకరణలో ఉద్యోగంలో అనుకూల మార్పులతో గడుపుతారు.

తుల:— వారం వారం ఒకే విధంగా వ్యాపారం సాగుచున్నదనుకొనే పని లేదు. గ్రహానుకూలత వలన, నూతన వస్తు సేకరణ, అధిక లాభార్జన ఆనందం, గృహానుకూలత, సంతానం మూలాన సంతోషం, ఆత్మీయుల ఆదరణ గల వారం. నగలో, ఖరీదైన వస్తువులో సేకరింప గలుగుతారు. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి. శుభ కార్యప్రాప్తి చాలమంది విషయంలో చెప్పదగి యున్నది.

వృశ్చికం:— క్రొత్త పరిచయాలేర్పడుతాయి. అధికారుల ఆదరణ లభింప గలదు. బంధువులు అనుకోకుండా యింటికి రాగలరు. శుక్ర శని వారా లలో దైవారాధన సమకూడుతుంది. కొంచెం ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించాలి. పుత్రికల విద్యాభివృద్ధిని గూర్చి సంతోషం చేకూర గలదు. స్థిరాస్థి పెంపొందే మార్గమున్నది. స్త్రీలకు: కళారంగ ఖ్యాతి, గృహ కార్యభారం చెప్పదగిన అంశాలు.

ధనుస్సు:— చాల ఉత్తమమైన వారం. పోగొట్టుకొనిన వస్తువులు దొరికే అవకాశమున్నది. చాలమంది ఉద్యోగ ప్రయత్నాలు చేస్తారు. లభించే గ్రహానుకూలత కూడ గలదు. సాంఘిక బాధ్యతలు పైన పడుతాయి. కుటుంబ వ్యవహా రాలలో చిక్కులు గలవు. స్త్రీలకు: క్రీడా రంగంలో అవకాశం సంఘంలో ఆదరణ లభింప గల అవకాశాలున్నాయి.

మకరం:— ఉద్యోగ ప్రయత్నాలలో ఆటం కాలు ఎదుర్కోవాలి. అయినవారితో కూడా ఘర్షణ రావచ్చు. నిదానం ప్రధానం. చాలమందికి ప్రయాణానుకూలత చెప్పదగి యున్నది. విందు వినోద కాలక్షేపాలలో పాల్గొన గలరు. స్త్రీలకు: దైవ కార్యానుకూలత, ఉద్యోగంలో అనుకూలత, ద్రవ్యాదాయం చెప్పదగిన అంశాలు.

కుంభం:— మిమ్మలను మోసగించాలని ప్రయత్నించే వారు ప్రక్కన చేరుతారు. వారి సలహాలను పాటించకండి. ఉద్యోగ వృత్తులలో ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. వాహనాలు, నగలు, నూతన వస్త్రాలు చాలమంది సంపాదించు కొన గలరు. ప్రయాణాలలో తీవ్రమైన బాధలకు చాలమంది గురికావలసిన వచ్చే అవకాశమున్నది. స్త్రీలకు: కుటుంబ బాధ్యత, వృత్తిలో ప్రగతి, సంతాన విషయంలో ఆనందం గలదు.

మీనం:— మీ వ్యాపారం బాగా సాగుతున్నది. చాల ముఖ్యమైన మార్పులు గావింపనున్నారు. వ్యవసాయ రంగంలో కూడా చాల మంది మార్పులు చేయనున్నారు. అవి ఫలించ గలవు. ఉత్సాహ వంతులకు విద్యా పరిశ్రమలో ఈ వారం అను కూలం. స్త్రీలకు: ఉన్నత విద్యార్జన, వృత్తిలో ప్రగతి, కించిత్తు ధనలాభం చెప్పదగిన వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# గోద్రెజ్® స్టోర్‌వెల్®

## కొద్దిగా ఎక్కువ ధర అంతే, మరి దానికి బదులుగా ఎన్నెన్నో లాభాలు



### ఎక్కువ దృఢమైనది. ఎక్కువ భద్రమైనది.
### ఎంచుకునేందుకు ఎక్కువ రకాల్లో. ఎక్కువగా మన్నేది.

**ఎక్కువ దృఢమైనది:**
విశిష్టమైన స్టీలుతో చేయబడినది. తుప్పును నిరోధించేది.
స్టీలు అల్మారాలన్నిట్లోకి సర్వోత్తమమైన ఫినిష్.

**ఎక్కువ భద్రమైనది:**
లాకర్ మరియు దర్వాజాలకి విరగని గోద్రెజ్ తాళం.
పైకి కనిపించని బందులు, దర్వాజాని పైనుంచీ కిందనుంచీ మూసివేయడానికి త్రీ-వే ఇంటర్ లాకింగ్ సాధనం.

**ఎంచుకునేందుకు ఎక్కువ రకాల్లో:**
పైకి క్రిందికి వీలుగా చేసుకోగలిగే షెల్ఫులు. టయ్-బార్ హేంగర్-రాడ్, లాకర్, నిలువుటద్దం మీ అవసరాలకి అనుగుణమైన తీరులో, కలయికలో.

**ఎక్కువగా మన్నేది:**
మూడు తరాలదాకా నిలుస్తుంది; బాగా నిలిచి పనిచేసేందుకోసమే తయారు చేయబడినది.

మోడల్స్ : స్టోర్‌వెల్ వార్డ్‌రోబ్ (చిత్రించబడినది), కాంపాక్ట్, మైనర్.
ఇప్పుడు గోద్రెజ్ సేఫ్‌మైరా కూడా దొరుకుతోంది.

సచిత్ర కరపత్రం కోసం రాయండి:
**గోద్రెజ్ & బాయిస్ మాన్యు. కం. ప్ర. లి.**
మార్కెటింగ్ డిపార్ట్‌మెంట్, పిరోజ్‌షా నగర్, బొంబాయి 400 079.

ప్రఖ్యాతి చెందిన వస్తువులు నిర్మించేవారు గోద్రెజ్® Godrej®

ULKA/GBS/1/80 TEL

# అమ్మో! మళ్ళీవచ్చాడమ్మా వెన్నదొంగ





# విజయ

పాస్ట్యురైజ్ చేయబడిన

# వెన్న

## చూస్తే ఊరుకోరు!

భోజన సమయంలో వెన్న వాడేవారంతా ఇప్పుడు విజయ వెన్ననే మరీ మరీ కోరుకుంటున్నారు. ఇది పాస్ట్యురైజ్ చేయబడింది. రుచిలో సాటి లేనిది. కమ్మని వాసనగలది. ఆరోగ్య పద్ధతులలో ప్యాక్ చేయబడింది. చూచినంతనే నోరూరించే విజయ వెన్నను ఒకసారి రుచి చూడండి.

**నోరూర్చే రుచులరాశి**

తయారు చేయువారు:
గుంటూరుజిల్లా
పాల ఉత్పత్తిదారుల సహకార సంఘం
లిమిటెడ్, వడ్లమూడి






amc/apddc/80C